# డాక్టర్ అమర్‌నాథ్ అద్భుత సృష్టి

## భారతదేశంలో నెంబర్-1
## హెర్బల్ ఫేస్ క్రీమ్ అని ఛాలెంజ్ చేస్తున్నాం !



అందాలకు తుది మెరుగులు దిద్దే

# సింధూర హెర్బల్ ఫేస్ క్రీమ్

- చలికాలంలో పొడిబారిన చర్మాన్ని ఉత్తేజ పరచి, నిగారింపు కల్గిస్తుంది
- ఐదు వారాలలో మెరిసే ముఖ వర్చస్సు
- వేసవిలో నల్లబడిన చర్మం క్రమంగా తెల్లబడుతుంది
- మొటిమలు, మచ్చలను నివారిస్తుంది
- స్త్రీలు, పురుషులు వాడదగిన ఏకైక ఫేస్ క్రీమ్



సినీ తార అపర్ణ



**సింధూర**
ఉపయోగించక ముందు






సినీ తార అపర్ణ



**సింధూర**
ఉపయోగించిన తరువాత

### ఉపయోగించిన వారి అభిప్రాయం

డాక్టర్ అమర్‌నాథ్ గార్కి,

అద్భుతమైన ముఖవర్చస్సు కోసం మీరు అందిస్తున్న హెర్బల్ ఫేస్ క్రీమ్ 'సింధూర' సత్ఫలితాలను యిస్తుంది. తక్కువ ఖరీదులో మీరు అందిస్తున్న సింధూర వాడకం వల్ల మంచి అనుభూతి మిగులుతుంది. 'సింధూర' చూపిన సత్ఫలితాలతో సంతృప్తి కలిగి నా కుటుంబంతో పాటు 20 మందికి పైగా ఇతరులకు ఈ క్రీమ్ వాడి చూడ వలసిందిగా సూచించాను. మధ్య తరగతి వారికి కూడా అందుబాటులో వున్నందుకు అభినందిస్తూ,

మీ
**సింహాద్రి కృష్ణ ప్రసాద్,**
సీనియర్ జర్నలిస్ట్, దివిసీమ, నాగాయలంక, కృష్ణా జిల్లా.

అన్ని ఫ్యాన్సీ, జనరల్, బ్యూటీపార్లర్స్, మందుల షాపులలో లభ్యం



## శ్రీ సత్యసాయి హెర్బోకేర్

నెం. 40, దుర్గానగర్ కాలనీ, చిత్తూరు. ఫోన్ : 23919, 27044



# చందమామ

అక్టోబర్ 1997






విడిప్రతి : **6.00**

సంవత్సర చందా : **72.00**




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'  సంచాలకుడు : బి. నాగిరెడ్డి

## సన్యాసుల సందేశం!

మనదేశ చరిత్రలో చోటుచేసుకున్న అసాధారణమైన ఒక సంఘటనను గురించి ఈ సంచిక బొమ్మల కథలో తెలుసుకుంటాం. ప్రారంభదశలోనే బ్రిటిష్ వలసపాలనకు వ్యతిరేకంగా వేలాది సన్యాసులు కత్తులు దూశారు! పరాయి పాలన నుంచి మాతృభూమికి విముక్తి కలిగించడానికి తమ ప్రాణాలు అర్పించారు. జన్మభూమిని కన్నతల్లిగా భావించడమే అందుకు కారణం. వారు దేశాన్ని దైవంలా ఎంతో పవిత్రంగా భావించారు. శ్రీ అరవిందులు (1872-1950) తన మిత్రుడిక్ రాసిన ఒక ఉత్తరంలో, "తల్లి భారతి కేవలం ఒక భూభాగం కాదు: ఆమె ఒక మహత్తర శక్తి, అధిదేవత..." అని పేర్కొనడం ఇక్కడ చెప్పుకోతగ్గ విశేషం!

మనదేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం కోరిన వారిలో శ్రీ అరవిందులు ముఖ్యులు. ఆయన జన్మదినమైన ఆగస్టు 15వ తేదిన మనకు స్వాతంత్ర్యం సిద్ధించడం ఒక విశేషం. ఈ సంవత్సరం అరవిందుల 125 జన్మదినోత్సవాలు జరుపుకుంటున్నారు. మంచిని ఆశించి అందరూ ఐకమత్యంతో, కలిసికట్టుగా ముందుకు అడుగువేసినట్టయితే మానవజాతి దివ్య సంతతిగా రూపాంతరం చెందగలదని ఆయన ప్రబోధించారు. ఆయన ఆశావాదాన్ని జీవితంలో అలవరచుకోవడమే మనం ఆయనకు ఘటించే నిజమైన స్మృత్యంజలి అవుతుంది!

| | | |
|---|---|---|
| సంపుటి : 101 | అక్టోబర్ '97 | సంచిక : 4 |
| విడిప్రతి : 6 - 00 | సంవత్సర చందా | 72- 00 |






Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

**CHANDAMAMA BOOKS ARE ALREADY A LEGEND! THEY OPEN A NEW HORIZON ON THE WORLD OF LITERATURE FOR THE YOUNG**

Added to the six titles by **Manoj Das** is the charming seventh–

**WHEN THE TREES WALKED**

by the inimitable story-teller **Ruskin Bond**




Rs. 30/-

Among the titles in the process of production are:

**STORY OF KRISHNA**
**STORY OF RAMA**
**STORY OF BUDDHA**



For details, write

**CHANDAMAMA BOOK**
Chandamama Buildin
Vadapalani, Madras - 600 02

వార్తలు–విశేషాలు:

# స్కాట్‌లాండుకు ప్రత్యేక పార్లమెంటు

1707వ సం॥లో యూనియన్ చట్టం అమలులోకి వచ్చినప్పటినుంచి అంటే, 290 సంవత్సరాలుగా స్కాట్‌లాండ్, యునైటెడ్ కింగ్‌డమ్‌లో భాగంగా ఉంటున్నది. ఇంగ్లాండు పార్లమెంటుకు తన ప్రతినిధులను పంపుతున్నది.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం, స్కాట్‌లాండుకు స్వతంత్రం లేకపోయినప్పటికీ, కనీసం ప్రత్యేక పార్లమెంటు కావాలన్న కోరిక బలంగా వినిపించింది. ఆ సమయంలో అధికారంలోవున్న లేబర్‌పార్టీ ఆ కోరిక పట్ల సానుభూతి కనబరచింది. అయినప్పటికీ 1974వ సం॥లో అది మూడవసారి అధికారానికి వచ్చినప్పుడే స్కాట్‌లాండ్ ప్రజల కోరికను తీవ్రంగా పరిశీలించసాగింది. 1979 సం॥లో ఈ విషయంగా 'రెఫరెండం' అంటే, ప్రజాభిప్రాయసేకరణ జరిగింది. కేవలం నలభైశాతం మంది ప్రజలు మాత్రమే దానికి సానుకూలంగా ఉన్నారన్న వాదంతో అప్పటి కన్సర్వేటివ్ ప్రభుత్వం ఆ కోరికను పక్కకు నెట్టింది!

గత మే నెలలో జరిగిన సాధారణ ఎన్నికలలో మళ్ళీ లేబర్‌పార్టీ అధికారానికి వచ్చింది. నూతన ప్రధాని టోనీ బ్లెయిర్ స్కాట్‌లాండులో మళ్ళీ 'రెఫరెండం' జరపగలమని ప్రకటించాడు. దాని ప్రకారం సెప్టెంబర్ 11వ తేదీన జరిగిన 'రెఫరెండం'లో 74.3 శాతం ప్రజలు ప్రత్యేక పార్లమెంటుకు మద్దతు తెలియజేశారు. ప్రస్తుత ప్రణాళిక ప్రకారం 1999వ సం॥లో ఎన్నికలు జరుగుతాయి. 2000వ సం॥ నాటికి ప్రత్యేక స్కాటిష్ పార్లమెంటు ఏర్పడుతుంది!

మూడుశతాబ్దాలకుపూర్వం స్కాట్‌లాండుకు ప్రత్యేక పార్లమెంటు ఉండేది. 13-14 శతాబ్దాలలో ఇంగ్లాండు–స్కాట్‌లాండ్‌ల మధ్యయుద్ధం జరిగింది. 1328వ సం॥లో ఇంగ్లాండు, స్కాట్‌లాండు స్వాతంత్ర్యాన్ని లాంఛనప్రాయంగా అంగీకరించింది. అయినా ఉభయ ప్రాంతాల మధ్య సుస్థిరమైన శాంతి ఏర్పడలేదు. 1638వ సం॥లో స్కాట్‌లాండులో తిరుగుబాటు జరిగింది. ఇంగ్లీష్ జనరల్ క్రామ్వెల్ 'న్యూ మోడల్ ఆర్మీ'ని వెంటబెట్టుకుని వెళ్ళి తిరుగుబాటును అణచి, 1660వ సం॥లో స్కాట్‌లాండును జయించాడు. 1707వ సం॥లో అది ఇంగ్లాండులో అంతర్భాగమయింది.

ప్రస్తుత అధికార వికేంద్రీకరణ, యూనియన్ విచ్ఛిత్తికి దారితీయగలదని కొందరు పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు. ప్రత్యేక పార్లమెంటును, స్కాటిష్ స్వాతంత్ర్యానికి మొదటి మెట్టుగా భావిస్తున్నారు. స్కాట్‌లాండ్ తరవాత, ప్రత్యేక అసెంబ్లీ కోసం వేల్స్‌లో మరొక రెఫరెండం జరిగింది.

అక్కడి పరిణామాలను చూస్తుంటే, ఈ శతాబ్దాంతానికి ఇప్పటి 'యునైటెడ్ కింగ్‌డమ్' ఉండదేమో అని పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు!





# వాణీనాథుడి కోరిక

చంద్రాపురం జమీలో చాలా గ్రామాలుండేవి. వాటిలో కాస్త పెద్దవనిపించుకున్న నాలుగైదింటిలో, మామిళ్ళ అగ్రహారం ఒకటి. ఆ అగ్రహారంలో కేశవభట్టు అనే పురోహితుడుండేవాడు. ఆరడుగుల ఎత్తు, చెవులకు బంగారు కుండలాలు, ముఖాన తాండవిస్తున్న తేజస్సు, స్వచ్ఛమైన వాగ్ధాటి ఇవన్నీ కలిసి ఆయనకు ఉన్న ఊళ్ళోనే గాక, జమీ మొత్తంమీదే మంచి పేరుతెచ్చి పెట్టాయి. ఎవరింట ఏ శుభకార్యం జరిగినా, కేశవభట్టుకే పెద్దపీట దక్కేది. ఎవరు ఏ దానం ఇవ్వదలుచుకున్నా భట్టునే తలచుకునేవారు. ఇలా ఒక వయసు వచ్చేసరికి ఆయన ఆర్జన బాగా పెరిగి, తాతలద్వారా సంక్రమించిన ఆస్తి మూడింతలైంది.

సంపన్నుడైన కేశవభట్టు సంతానం మాత్రం ఒకే ఒక్క ఆడపిల్ల. ఆ అమ్మాయి పేరు శారద. చక్కని చుక్క. తండ్రి దగ్గర శాస్త్రజ్ఞానమూ, తల్లి దగ్గర సంగీతజ్ఞానమూ సంపాదించుకున్న శారద, ఒద్దికైన పిల్లగా, మంచి పనిమంతురాలిగా కూడా పేరు తెచ్చుకున్నది.

భట్టు సంపదకంతటికీ ఏకైక వారసురాలు శారదే గనక, చాలామంది ఆయనతో వియ్యమందాలని ఉవ్విళ్ళూరుతుండేవారు. అది గ్రహించిన కేశవభట్టు, తనకు కాబోయే అల్లుడు పౌరోహిత్యం నేర్చిన ధనవంతుడూ, అందగాడూ అయివుండాలనీ, అటువంటి వాణ్ణి ఇల్లరికం తెచ్చుకుని తన పౌరోహిత్యం అప్పజెప్పాలన్నదే తన నిర్ణయమనీ, ఒకరిద్దరి చెవిన వేశాడు. అది కాస్తా చిలవలుపలవలై, అల్లుడి ఎన్నికలో కేశవభట్టు ఏవేవో కోరికలన్నీ మనసులో పెట్టుకుని, చాలా పట్టుదలగా వున్నాడన్న వదంతి వ్యాపించింది.

లక్ష్మీగాయత్రి

అలావుండగా, ఒకసారి అగ్రహారానికి కొద్దిదూరంలోవున్న కొమ్మంగి అనే పల్లెలో, కేశవభట్టు బంధువులెవరి ఇంటనో పెళ్ళి జరిగింది. ఆ పెళ్ళికి వెళ్ళడానికి ఏదో కారణాన భట్టుకు తీరక, భార్యనూ, కూతుర్నీ బండెక్కించి పంపాడు.

అదే పెళ్ళికి మగపెళ్ళివారి తరఫున, వాణీనాధుడనే యువకుడురావడంతటస్థించింది. విద్యాసంపదే గాని ధన సంపద అంటూ ఏమీలేని వాణీనాధుడు, అర్థ శాస్త్రాన్ని కరతలామలకంగా అభ్యసించి, చంద్రాపురం జమీందారు భువనచంద్రుడి దగ్గర ఉద్యోగం చేస్తూ, తనకంటూ వున్న తల్లి నొక్కర్తినీ దగ్గరపెట్టుకుని, చంద్రాపురంలోనే వుంటున్నాడు. ప్రస్తుతం జరుగుతున్న పెళ్ళి, చంద్రాపురంలోని అతడి సహోద్యోగి మిత్రుడిదే.



మిత్రుడి పెళ్ళికి వచ్చిన వాణీనాధుడు, అక్కడ చుక్కల్లో చందమామలా వున్న శారదను చూసి, తొలిసారిగా తన పెళ్ళి గురించిన ఆలోచనలోపడి, చివరకు మిత్రుడితోతనకోరికచెప్పాడు. ఆ మిత్రుడు, తన బావమరిదితో విషయం చర్చించి, వాణీనాధుడితో, "ఆ అమ్మాయి పురోహితుడు కేశవభట్టు ఏకైక పుత్రికట!" అని చెప్పి, భట్టుకు రాబోయే అల్లుడి పట్లవున్న కోరికల గురించి వివరించి, "అందువల్ల, నువ్విక ఆ విషయం మరిచిపోవడం మంచిది!" అన్నాడు.

మిత్రుడు చెప్పింది విన్న తర్వాత, వాణీనాధుడికి కూడా తనకోరిక తీరటం అసంభవమనిపించింది. తనుకాస్తోకూస్తో అందగాడేగాని, ధనవంతుడుకాదు. పౌరోహిత్యం తనకు రాదు. తనదీ కేశవభట్టుదీ ఎదురుబొదురు కోర్కెలు. తమ ఇద్దరి కోర్కెల్లో ఒకరిది నెరవేరాలంటే, రెండవ వారు తమ కోర్కెను మరిచిపోక తప్పదు!

ఇలా ఆలోచించిన వాణీనాధుడు, శారదను పెళ్ళాడాలనే తనకోరికను తనలోనే అణచుకుని, తిరిగి చంద్రాపురం వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత కొన్నాళ్ళకు ఆశ్వయుజ మాసం వచ్చింది. చంద్రాపురం దివాణంలో శరన్నవరాత్రుల ఉత్సవం ప్రారంభమైంది. నవరాత్రులు ముగిసిన మర్నాడేజమీందారు భువనచంద్రుడి షష్ఠిపూర్తి మహోత్సవం. వీటికి ప్రధాన పురోహితుడుగా వుండమని, సకుటుంబంగా రమ్మని జమీందారు,



కేశవభట్టుకు ప్రత్యేక ఆహ్వానం పంపాడు. కేశవభట్టు భార్యా, కుమార్తెనూ వెంటబెట్టుకుని నాలుగురోజులు ముందుగానే చంద్రాపురం చేరుకున్నాడు.

ఆ సంవత్సరం, ఏవో రెండుమూడు సందర్భాల్లోవాణీనాధుడి నిజాయితీ, పనితీరూ జమీందారును ఆకట్టుకోవడంతో, ఆయన ప్రత్యేకంగా వాణీనాధుణ్ణి పిలిపించి, కేశవభట్టుకు పరిచయం చేసి, "వాణీనాధా! ఇకనుంచి, షష్ఠిపూర్తి వేడుకలు కూడా పూర్తిగా ముగిసేదాకా, భట్టుగారి వెంటనే వుంటూ, ఆయన చెప్పిన ఏర్పాట్లన్నీ చేయించే బాధ్యత నీ మీద పెడుతున్నాను. ఆయనకు ఏ మాత్రం అసంతృప్తి కలగకూడదు. ఇందుకుగాను రెండువేల రూపాయలు నీకివ్వమని దివానుగారికి చెప్పాను. ఆ డబ్బు నీ దగ్గర పెట్టుకుని వినియోగించు," అన్నాడు.

జమీందారు ప్రత్యేకాభిమానాన్నిపొందిన వాణీనాధుడిపట్ల, కేశవభట్టుకు కాస్త కుతూహలం కలిగింది. రెండు రోజులపాటు అతడి ప్రవర్తనా, పనితీరూ గమనించేసరికి, ఆ కుతూహలం కాస్తా అభిమానంగా రూపాంతరం చెందింది.

మూడవరోజున, వాణీనాధుడు, కేశవభట్టు చెప్పినవిధంగా పూజావేదికను సిద్ధం చేయించి, భట్టును తీసుకువెళ్ళిచూపించాడు. భట్టు మెచ్చుకుంటూ, "బాగుందయ్యా, వాణీనాధా! చక్కగా వున్నది," అన్నాడు.

కేశవభట్టు మెప్పుదలకు వాణీనాధుడితో బాటు అక్కడే వున్న తాపీమేస్త్రీ గురునాధం కూడా ఎంతోఆనందించి, వేదికవైపు తిరిగి చేతులు జోడిస్తూ, "మంచి రోజు చూసి, దేవుణ్ణి తలుచుకుని ప్రారంభించిన పని ఇంత చక్కగానూ అవుతుంది, బాబూ మరి!" అన్నాడు.

ఆ మాట వింటూనే వాణీనాధుడు, గురనాధంకేసి తలతిప్పి, "అలాగా! అయితే, మొన్న రామయ్య ఇంటిపని, చెడ్డరోజున, దయ్యాన్ని తలుచుకుని ప్రారంభించావా, గురునాధం?" అంటూ ప్రశ్నించాడు హేళనగా.

ఆ ప్రశ్నకు గురునాధం ముఖంలో రంగులు మారాయి. కేశవభట్టు, వాణీనాధుడివైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

వాణీనాధుడు, భట్టుతో, "రామయ్య అని ఒక పేదరైతు, పాపం డాబా ఇల్లుకట్టి

కొడుక్కు మిగిల్చిపోవాలని కష్టపడి పైసా కూడబెట్టాడు. ఆ రామయ్య, ఈ గురునాథంకు దగ్గరబంధువు కూడా. ఇల్లు కట్టే పని గురునాథానికి అప్పజెప్పిన రామయ్య, మేస్త్రీకివ్వాల్సిన పైకం కాస్త తగ్గించమని ప్రాథేయపడ్డాడు. అదేదో ఇష్టంలేకపోతే చెప్పేసినా బాగుండేది! కాని పల్లెత్తుమాట ఎదురుచెప్పకుండా పనికి ఒప్పుకుని, ఇల్లంతా నానా అవకతవకలతోనూ కట్టిపెట్టాడు, ఈ గురునాథం. ఈ చేసింది చాలక, 'ఇదేమిటి, బావా?' అని రామయ్య అడిగితే, 'ఎంత కూలికి అంతపని!' అంటూ ఎగతాళికూడా చేశాట్ట. ఇప్పుడు జమిందారుగారివ్వబోయే బహుమానాలకు ఆశపడి, ఈ వేదికను మాత్రం ఎక్కడా హెచ్చు తగ్గులు లేకుండా కట్టాడు. మీ మెప్పుపొందడానికి మరొక కారణం చెబుతున్నాడు," అని చెప్పాడు.

అంతా విన్న భట్టు, గురునాథం వైపు మందలింపుగా చూస్తూ ఏదో అనబోయేంతలో, వాణీనాథుడు, "చూడు, గురునాథం! నువ్వంతో ఇంతో చదువుకున్నవాడివి. అనంతమైన ఈ కాలచక్రంలో అన్నీ మంచిరోజులే గాని, చెడ్డరోజులంటూ ఏమీలేవు. ఆ విషయం మనుషులకు స్పష్టంగా చెప్పడం కోసమే సిద్ధివినాయకుడు చవితిరోజునా, కృష్ణుడుగా అవతారమెత్తిన శ్రీమహావిష్ణువు అష్టమినాడూ జన్మించారు. ఒకపని ప్రారంభించడానికైనా, దానిని సవ్యంగా ముగించడానికైనా కావలసినవి చిత్తశుద్ధి, పట్టుదలా మాత్రమేనని ఇకనైనా గ్రహించు," అన్నాడు.

వాణీనాథుడి మాటలకు గురునాథం తలవంచుకుని, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.





కేశవభట్టు సాలోచనగా తల పంకిస్తూ, "వాణీనాధా! అయితే, ఏ పని అయినా ఎప్పుడైనాప్రారంభించవచ్చుననా, నీ అభిప్రాయం?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు వాణీనాధుడు ఒక్కక్షణం మౌనంగా వూరుకుని, తర్వాత, "అయ్యా, గృహ పురోహితులైన తమరిని నా అభిప్రాయాలూ, నమ్మకాలూ నొప్పిస్తే క్షమించండి! ఈరోజుల్లో, మనిషి ప్రతిదాన్నీ తన స్వలాభానికి ఉపయోగించుకోవటానికి బాగా అలవాటు పడ్డాడు. దానికి మంచి ఉదాహరణగా, ఈ గురునాధాన్ని చూశారు గదా! ఇటువంటి పరిస్థితుల్లో – ఆచార నియమాలకంటే, నీతి నియమాలే గొప్పవనీ, భగవంతుడుసైతం మంచితనానికీ, నిస్వార్థానికీ విలువయిచ్చి ఆదరిస్తాడనీ చెప్పవలసిన ధర్మం విద్యావంతులైన మనకున్నది!" అన్నాడు.

"బాగుంది నాయనా! మనిద్దరం ఒక రకంగా ఉత్తర దక్షిణ ధృవాల్లాంటి వాళ్ళమైనప్పటికీ, వివేకవంతమైన నీ మాటలు నన్ను కాస్త లొంగదీసుకున్నట్టే కనిపిస్తున్నవి," అన్నాడు.

ఆమాటలు వినగానే ఒక్కక్షణం వాణీనాధుడిమొహంలో, ఏదోభావావేశం మెరుపులా వచ్చి మాయమైంది. చప్పున ఏదో అనబోయిన అతడు, అతి ప్రయత్నంమీద వెంటనే తనను తాను నిగ్రహించుకున్నాడు.

అది గమనించిన కేశవభట్టు, "ఏమిటి, వాణీనాధా! ఏదో చెప్పదలుచుకుని మళ్ళీ వెనక్కు తగ్గుతున్నావు. అదేమిటో నిర్భయంగా చెప్పు!" అన్నాడు.

వాణీనాధుడు సంకోచంగా తలవంచుకుంటూ, "ఏమీలేదు. నామాటలుమిమ్మల్ని లొంగదీసుకున్నవన్నారు. నా కోరిక కూడా మీ కోరికను లొంగదీసుకుంటే, ఎంత బాగుండునో కదా అనబోయాను, అంతే," అన్నాడు.

ఆ మాటలకు కేశవభట్టు ఆశ్చర్యంగా, "నా కోరిక, నీ కోరిక – ఏమిటవి?" అంటూ ప్రశ్నించాడు.

వాణీనాధుడు ఇంక ఏదీ దాచకుండా అంతాచెప్పి, "మీ అమ్మాయి శారద అన్ని విధాలా ఎన్నదగ్గ పిల్ల. కాని, ఉన్నది ఒకే ఒక్క కుమార్తె గనక, కాబోయే అల్లుడు ఇలా వుండాలి, ఇల్లరికం రావాలి అన్న మీ కోరిక కూడా అసమంజసమైనది కాదుగదా!" అన్నాడు.

అతడి మాటలు విన్న కేశవభట్టు నవ్వుతూ, "నాయనా, కోరిక అంటూవున్నది నీకే. దానికి వ్యతిరేకమైన కోరికలు నాకేమీ లేవు," అన్నాడు.

అందుకు వాణీనాధుడు ఎంతో ఆశ్చ ర్యంగా, "ఉన్నది ఒక్కర్తే కుమార్తె గనక, అల్లుడి ఎన్నికలో మీరెంతో పట్టుదలగా వున్నారని అన్నారే, అందరూ!" అని ప్రశ్నించాడు.

భట్టు నవ్వి, "ఉన్నది ఒక్క కూతురైనా, పదిమంది కూతుళ్ళయినా, వివేకవంతు డైన ప్రతి తండ్రీ కోరుకునేది ఒక్కటే! అల్లుడు మంచివాడై తనకూతురు సుఖంగా జీవించాలని! మిగిలిన పుకార్లంటావా, నా సంపద చూసి, బెల్లం చుట్టూ ఈగల్లా ముసిరే తేలికపాటి మనుషుల్ని దూరంగా తోలటానికి, నేను విసిరిన విసుర్లవి. అంతే!" అన్నాడు.

భట్టు మాటలకు వాణీనాధుడు ఆనం దంగా, "అయితే..." అంటూ ఏదో చెప్ప బోతూండగా, శారదను వెంటబెట్టుకుని అక్కడికి వచ్చిన భట్టు భార్య, "పూజావేదిక చూడటానికి వచ్చాం!" అన్నది.

భట్టు నవ్వుతూ, "కళ్యాణవేదిక కూడా తయారైంది, చూసివెళ్ళండి," అని, ఆశ్చ ర్యంగా చూస్తున్న భార్యకు, వాణీనాధుణ్ణి చూపిస్తూ, "వాణీనాధుడని చురుకైన కుర్ర వాడు. మనకు అల్లుడైతే బావుంటుంది, అని నిన్న రాత్రి నీతో అన్నానే, ఆ వాణీ నాధుడు ఇతనే!" అని కూతురు వైపుతిరిగి, "ఏమ్మా శారదా! కొమ్మంగిలో జరిగిన పెళ్ళిలో నీకు ఇతను పరిచయమే గదా! నిన్న రాత్రి నేను, మీ అమ్మతో ఇతని విషయం ప్రస్తావిస్తున్నప్పుడు, పక్కగది లోంచి నువ్వు తొంగి చూసినట్టు గుర్తు. అప్పటి నీ మొహం, ఇప్పుడు సిగ్గుపడు తున్న నీ మొహం ఒక్కలాగే వున్నట్టుకూడా నాకు తోస్తున్నది," అన్నాడు.

తండ్రిమాటలకు శారద మరింత సిగ్గు పడుతూ తలవంచుకున్నది. అది చూసి భట్టు ఆనందంగా, "ఏం, వాణీనాధా, నీ కోరిక తీరినట్టే గదా?" అన్నాడు.

కాబోయే మామగారి మాటలకు, వాణీ నాధుడు కూడా కాస్త సిగ్గుపడుతూ, "ఆఁ! ఇక మీ కోరికను కూడా ముమ్మాటికీ తీరుస్తాను," అన్నాడు.



# లాంతరు - చిలకపంజరం

హేలాపురిలోని లోకనాధుడూ, సుగంధపురవాసి వీరబాహుడూ ప్రాణమిత్రులు. ఇద్దరికీ గల ఒకే ఒక వ్యసనం మద్యపానం. సమయం దొరికినప్పుడు మిత్రులిద్దరూ, తమ ఇద్దరి ఇళ్ళల్లో, ఏదో ఒకరి ఇంట మద్యపానం చేస్తూండేవాళ్ళు.

ఒకనాడు లోకనాథుడు, వీరబాహుడికి, "మిత్రమా! నా భార్య పుట్టింటికి వెళ్ళింది. ఇంట్లో మద్యానికి కొదువలేదు. ఈ రాత్రి నువ్వు వస్తే, ఆనందాంబుధిలో తేలియాడవచ్చు," అని కబురుపంపాడు.

ఆ రాత్రి వీరబాహుడు, లోకనాధుడి ఇంటికి బయలుదేరబోతూ, చీకటిరాత్రులవడం వల్ల, వెంట ఒక లాంతరు తీసుకుని మరీ ప్రయాణంకట్టాడు. ఆ రాత్రి మిత్రులిద్దరూ మద్యపానంలో మునిగితేలాక, వీరబాహుడు, లోకనాధుడి వద్ద సెలవు తీసుకుని సుగంధపురికి బయల్దేరాడు.

అర్ధరాత్రివేళ అడవిదారి వెంట ప్రయాణించేటప్పుడు, గోతుల్లో, పొదల్లో పడకుండా, లాంతరు సాయంతో ఇల్లు చేరుకుని, గుర్రుపెట్టి నిద్రపోయాడు వీరబాహుడు.

అయితే, ఇంకా బాగా తెల్లవారకుండానే లోకనాధుడి నౌకరు తలుపుతట్టి, వీరబాహుడికి లోకనాధుడు పంపిన ఒక చీటీ ఇచ్చాడు. అందులో: "మిత్రమా, రాత్రి అడవిదారిన ఏ పాముకాటుకో గురికాకుండా ఇల్లుచేరావనుకుంటాను! నువ్వు మరిచిపోయి వెళ్ళిన లాంతరు పంపుతున్నాను. రాత్రి నువ్వు వెంట బెట్టుకుపోయింది, నా భార్య పుట్టినింటి నుంచి తెచ్చుకున్న చిలకా, దాని పంజరం! సమయానికావిడ ఇంట్లో వుంటే కాపురం చెడేంత గొడవయ్యేది. నువ్వు పాముకాటుకు గురికాకుండా, నేను ఏకాకిని కాకుండా వుండేందుగ్గాను - ఈనాటితో మద్యపానానికి స్వస్తిపలుకుదాం!" అని వున్నది.

— కోనే నాగవెంకటఆంజనేయులు





# సామ్రాట్ అశోక

**10**

[తండ్రి ఆనతి ప్రకారం అశోకుడు ఉజ్జయినిలో రాజప్రతినిధి పదవిని చేపట్టి, ప్రజారంజకంగా పరిపాలన సాగించసాగాడు. మగధరాజధాని పాటలీపుత్రంలో వృద్ధుడైన రాజు బిందుసారుడి ఆరోగ్యం ఆందోళనకరంగా పరిణమించడంతో – తక్షశిలలో ఉన్న సుశేముణ్ణీ, ఉజ్జయినిలో ఉన్న అశోకుణ్ణీ పాటలీపుత్రానికి రప్పించాలని ప్రధాన మంత్రీ, సేనాధిపతీ రాజపురోహితుడూ నిర్ణయించారు. సుశేముడి ప్రయాణాన్ని జాప్యం చేయించడానికి, అశోకుడి మిత్రుడైన యశుడు ఇద్దరు నాట్యకత్తెలను తక్షశిలకు పంపాడు.—తరవాత]

అశోకుడు అడవికి వేటకు వెళ్ళి, సాయంకాలానికిరాజభవనానికితిరిగివచ్చి, "విదీశా! అడవిలో చాలాజంతువులనువేటాడి బాగా అలిసిపోయాను," అన్నాడు భార్యతో.

"తమరిప్పుడు శారీరకంగా మాత్రమే అలిసిపోయారు. జంతువులనూ, పక్షులనూ వేటాడాలంటే, మానసికంగా కూడా అలిసిపోయే మంచిరోజుకోసం నేను ఎదురుచూస్తున్నాను, ప్రభూ!" అన్నది విదీశాదేవి.

"అదేమిటి దేవీ, అలా అంటున్నావు? రాజ్యవ్యవహారాలలో సతమతమయ్యే నా మనసుకు కాస్త ఆహ్లాదం కలిగించే వినోదం ఈ వేట ఒక్కటే కదా! అయినా నేను జంతువుల మాంసం తినడానికి వాటిని వేటాడటం లేదు కదా?" అన్నాడు అశోకుడు.

"అంటే తమరు జంతువులను కేవలం చంపడంలో ఆనందం అనుభవిస్తున్నా



రన్న మాట! అది మరీ ఘోరం ప్రభూ!" అన్నది విదీశాదేవి బాధగా.

"ఈ రోజు నేనొక పెద్దపులినీ, చిరుత పులినీ చంపాను. ఆ దుష్టమృగాలను చంపడం ద్వారా వాటికి ఆహారంకానున్న జింకలు, కుందేళ్ళు వంటి అనేక సాధు జంతువుల ప్రాణాలను రక్షించినట్టే కదా?" అని అడిగాడు అశోకుడు.

"ప్రభూ! పులులూ, సింహాలూ వినోదం కోసం జంతువులను చంపడం లేదు. తమ ఆకలి తీర్చుకోవడానికి మాత్రమే వాటిని చంపుతున్నాయి. అయినా, జంతువులకు మంచి చెడ్డలు, ధర్మాధర్మాలు తెలియవు కదా! కాని మనుషులకు తెలుసు. క్రూర జంతువులకు సాధుజంతువులను చంపి తినడం సహజగుణం. పైగా అవి మరొక విధంగా బతకలేవు. కాని వివేకవంతులైన మనుషుల విషయం వేరు కదా!" అన్నది విదీశాదేవి ప్రశాంతంగా.

అశోకుడుభార్యమాటలకుమందహాసం చేశాడు. కాని ఏమీ మాట్లాడలేదు. అంతలో ఒకపరిచారిక లోపలికివచ్చి, అశోకుడికి నమస్కరించి, "వారణాశినుంచి వచ్చిన ఒక జ్యోతిష్కుడు తమదర్శనం కోసం ప్రవేశమంటపంలో వేచి ఉన్నాడు," అన్నది.

"జ్యోతిష్కుడా!" అన్నది విదీశాదేవి.

"అవును దేవీ, నీకా విషయం చెప్పడం మరిచాను. అతడు భవిష్యత్తును చెప్పడమే కాదు; దానిని సాధించే సులభమార్గంకూడా సూచిస్తాడట. అతడు ఇక్కడి మహాకాల ఆలయదర్శనానికి వచ్చినట్టు ప్రముఖవర్తకుడులలితదత్తుడుచెప్పాడు. నేనే రమ్మన్నాను," అంటూ అక్కడినుంచి లేచి వెలుపలికి నడిచాడు అశోకుడు.

జ్యోతిష్కుడూ, లలితదత్తుడూ అశోకుణ్ణి చూడగానే లేచి నిలబడ్డారు. జ్యోతిష్కుడు ఒంటినిండా కాషాయాంబరాలు ధరించి, నొసట పెద్ద కుంకుమబొట్టు పెట్టుకుని, మెడలో రుద్రాక్షమాల వేసుకుని ఉన్నాడు.

అశోకుడు కూర్చున్న తరవాత, జ్యోతిష్కుడు ఏదో మంత్రం పఠించి, ఆయన కుడిచేతినిపుచ్చుకుని హస్తరేఖలను పరిశీలించాడు. ఆ తరవాత కళ్ళు మూసుకుని, కొంతసేపటికి తెరిచి, "శుభ ఘడియలు ఆసన్నమయ్యాయి!" అన్నాడు నవ్వుతూ.

"దేనికి?" అన్నాడు అశోకుడు.

"తమరు స్వతంత్రం ప్రకటించుకోవడానికి!" అన్నాడు జ్యోతిష్కుడు.

"ఎవరినుంచి?" అని అడిగాడు అశోకుడు ఆశ్చర్యంగా.

"తమరు అవంతీ ప్రాంతానికి రాజయ్యే శుభఘడియలు సమీపించాయి. అవంతిని స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకునిరాజుగా పట్టాభిషిక్తులు కావచ్చు!" అన్నాడు జ్యోతిష్కుడు.

"అది మగధ సామ్రాజ్యాధినేత అయిన మా తండ్రికి వ్యతిరేకంగా చేసే తిరుగుబాటు అవుతుంది కదా?" అన్నాడు అశోకుడు.

"నిజమే. అయితే, తమరు మహారాజు కావడానికి అదొక్కటేమార్గం! కాబట్టి దానిని అనుసరించడంలో తప్పులేదు. పాటలీపుత్రంలో మహారాజుగారి ఆరోగ్యం ఆందోళనకరంగా పరిణమించింది. యువరాజు సుశేముణ్ణి రాజును చేయాలని నిర్ణయించారు!" అన్నాడు జ్యోతిష్కుడు.

"మా తండ్రి ఆరోగ్యం ఆందోళనకరంగా ఉందా?" అన్నాడు అశోకుడు విచారంగా.

"అవును. అయినా తమరు పాటలీపుత్రానికి వెళ్ళడానికి లేదు. వెళితే, మీ ప్రాణానికే ఆపద వాటిల్లుతుంది! కనీసం ఇంకొక్క సంవత్సరంపాటు ఉజ్జయినిని వదిలివెళ్ళడం క్షేమం కాదు," అన్నాడు జ్యోతిష్కుడు.

అంతలో పక్కనుంచి ఏదోశబ్దం రావడంతో అశోకుడు అటుకేసి తిరిగి చూశాడు. కిటికీ నుంచి ఎవరో తొంగి చూస్తున్నారు. కోపంతో అశోకుడి కనుబొమలు ముడిపడ్డాయి. మరుక్షణంలో అక్కడినుంచి వచ్చిన యశుణ్ణి చూడగానే అశోకుడు నవ్వుతూ, "రా, మిత్రమా రా! కిటికీ



నుంచి తొంగి చూసే సాహసం చేసిందెవరా? అని ఆశ్చర్యపోయాను," అన్నాడు.

"ఇక మేము సెలవుతీసుకుంటాము!" అన్నాడు లలితదత్తుడు అశోకుడితో.

"ఒక్క అడుగు ముందుకు వేయడానికి సాధ్యపడదు!" అన్నాడు యశుడు తన ఒరలోని కత్తిమీద చేయివేస్తూ.

"యువరాజుగారి సమక్షంలోనే వారి అతిథికి జరిగే మర్యాద ఇదా?" అన్నాడు జ్యోతిష్కుడు బాధగా.

"శత్రు గూఢచారులను ఇంతకన్నా ఘనంగానే సత్కరించాలి!" అంటూ యశుడు జ్యోతిష్కుడి చేయిని వడిసి పట్టుకుని, "శిఖరసేనా! నువ్వు నన్నెరుగవు. కాని నిన్నునేనుబాగా ఎరుగుదును. పాటలీపుత్రంలో నువ్వు సుశేముడి తమ్ముళ్లతో



కలిసి తిరగడం నేను చూశాను. మగధ సామ్రాజ్యానికి అశోకుణ్ణి మహారాజును చేయకూడదని భావించే వాళ్ళలో నువ్వు ఒకడివి. ప్రాణాలపై ఆశవున్నట్టయితే ఏ పథకంతో ఇక్కడికి వచ్చావో మర్యాదగా చెప్పు!" అని గద్దించాడు.

జ్యోతిష్కుడి ముఖం వెలవెలబోయింది. లలితదత్తుడు భయంతో వణకసాగాడు.

యశుడు, "ఎవరక్కడ?" అని చేతులు చరచగానే ఇద్దరుభటులువచ్చినిలబడ్డారు.

"ఈ దుర్మార్గులను కాళ్ళు చేతులు బంధించి కారాగారంలో వేయడానికి తమ అనుమతిని ప్రార్థిస్తున్నాను," అన్నాడు యశుడు అశోకుడితో.

అశోకుడు అంగీకార సూచకంగా తల పంకించాడు.

భటులు వాళ్ళిద్దరినీ అవతలికి లాక్కుపోయారు.

"తమరిని పాటలీపుత్రం వెళ్ళకుండా చేయాలన్నదే ఆ దుర్మార్గులపథకం! తమ సవతి సోదరులలో తమకు మద్దతునిచ్చే వారు ఒక్కరూ లేరు. అందరూ అసూయాగ్రస్తులే. రాజుగారి మరణానంతరం తమరిని సింహాసనం అధిష్ఠించకుండా చేయాలని పథకాలు ఆలోచిస్తున్నారు. రాజుగారి ఆరోగ్యం క్షీణించింది. ఈ శిఖరసేనుడు తక్షశిలకు చెందిన వాడు. యువరాజు సుశేముడి ప్రతినిధిగా పాటలీపుత్రంలో పరిస్థితులను పరిశీలిస్తున్నాడు. ఈ అవంతి ప్రాంతానికి మాత్రం రాజు కావాలనేఆశను తమలో కలిగించినట్టయితే, తమ దృష్టి మగధ సింహాసనం మీద పడదని ఆ మూర్ఖులు కలలుకంటున్నారు!" అన్నాడు యశుడు ఆవేశంగా.

ఆ తరవాత అతడు, తాను పాటలీపుత్రానికి వెళ్ళి అశోకుడి తల్లిదండ్రులను దర్శించి మాట్లాడిన విషయం గురించీ, రాజుగారి అనారోగ్యం కారణంగా రాజధాని రాజకీయాలలో ఏర్పడిన పరిణామాలను గురించీ అశోకుడికి వివరంగా తెలియ జేశాడు.

"మిత్రమా! తమరు వెంటనే పాటలీపుత్రానికి బయలుదేరాలి. ప్రధానమంత్రీ, సేనాధిపతీ, రాజపురోహితుడూ మగధ ప్రజలక్షేమాన్ని కాంక్షించి, తమరిని రాజును చేయాలనే ఉద్దేశంతోనే ఉన్నారు. స్వార్థపరులైన రాజోద్యోగులు కొందరు తమ స్వలాభం కోసం సుశేముణ్ణి రాజును

చేయాలని ఉబలాట పడుతున్నారు. అయినా, పాటలీపుత్రానికి మొదట చేరుకునే వారికే మహారాజుగా పట్టాభిషిక్తుడయ్యే అవకాశం ఎక్కువ!" అన్నాడు యశుడు.

అశోకుడు ఏమీ మాట్లాడలేదు. గంభీర వదనంతో కూర్చున్నాడు. ఆయన మనసులో ఏవేవో ఆలోచనలు రాసాగాయి.

కొంతసేపటికి అక్కడికి వచ్చిన విదీశాదేవి,యశుణ్ణిచూసి,"నమస్కారం,అన్నయ్యా! నువ్వు పాటలీపుత్రం నుంచి తిరిగి వచ్చిన విషయం తెలియనేలేదే!" అన్నది చిన్నగా నవ్వుతూ.

"ఇప్పుడే వస్తున్నాను, చెల్లెమ్మా!" అన్నాడు యశుడు.

విదీశాదేవి అశోకుడికేసి తిరిగి, "పాటలీపుత్రం నుంచి ఇద్దరు దూతలు వచ్చారు. ప్రభూ, తమ దర్శనంకోసం వేచి ఉన్నారు," అన్నది.

అశోకుడు ఏమీ మాట్లాడలేదు. కాని యశుడు వెంటనే, "చాలా సంతోషం! ఆ దూతలు తెచ్చిన సందేశం ఏమిటో నాకు తెలుసు. యువరాజు అశోకుడు వెంటనే పాటలీపుత్రానికి బయలుదేరాలి. తక్షశిలలోని సుశీముడికి కూడా అటువంటి సందేశమే పంపి ఉంటారు!" అన్నాడు.

"యువరాజు వెంటనే బయలుదేరాలా?" అని అడిగింది విదీశాదేవి.

"వెళ్ళి తీరాలి!" అన్నాడు యశుడు.

"కారణం?" అని అడిగింది విదీశాదేవి.

"తండ్రి మరణశయ్యపై ఉన్నప్పుడు పక్కనే ఉండడం తనయుడి నైతికధర్మం! రాజకీయంగా ఆలోచిస్తే సుశీముణ్ణి రాజ్యా



ధికారం చేపట్టకుండా చేయడానికి యువరాజు రాజధానిలో ఉండడం చాలాఅవసరం!" అన్నాడు యశుడు.

"అగ్రసోదరుడికి రాజ్యాధికారం దక్కనీయకుండా చేయడంఅన్యాయంకాదా?" అని అడిగింది విదీశాదేవి నెమ్మదిగా.

"ఒక తమ్ముడిగా అలా చేయడం అన్యాయమే. అయితే, సుశీముడు రాజ్యాధికారం చేపడితే అది మగధ సామ్రాజ్యంలోని అశేష ప్రజానీకానికి అన్యాయం చేసినట్టవుతుంది. అది అంతకన్నా అన్యాయం!" అన్నాడు యశుడు.

ఆ సమాధానానికి విదీశాదేవి మౌనం వహించింది.

యశుడు అశోకుడితో, "మిత్రమా! ఒక్క క్షణం కూడా ఆలస్యం చేయకూ

డదు! మన సైన్యంలో సగం ఇక్కడేఉం టుంది. మిగతా సగం మీవెంట వస్తుంది!" అన్నాడు దృఢమైన కంఠస్వరంతో.

* * *

అర్ధరాత్రి వేళ ఒక విశాలమైన గదిలో పట్టు పరుపు మీద కూర్చుని, మద్యం సేవిస్తూ, గ్రీకుసుందరి నాట్యాన్ని చూస్తూన్న సుశేముడు హఠాత్తుగా అక్కడికి వచ్చిన ఇద్దరు నాట్యకత్తెలను చూడగానే, "మీరెలా ఇక్కడికి వచ్చారు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"తమరిచ్చిన రాజముద్రిక సాయంతోనే వచ్చాము ప్రభూ!" అన్నారు నాట్యకత్తెలు గలగలా నవ్వుతూ.

"వెళ్ళిన పని పూర్తిచేయక పోగా, మూర్ఖుల్లాగా పట్టుబడిపోయి, అశోకుడి భార్యకు పరిచారికలుగా చేరిపోయారని గూఢ చారులద్వారావిన్నాను. అది నిజమే కదా?" అన్నాడు సుశేముడు.

"అక్షరాలా నిజం ప్రభూ! అయితే, తమరు ఆదేశించిన పనిని ఎలాగైనా ముగించుకుని రావాలన్న పట్టుదలతోనే ఇన్నాళ్ళూ అక్కడ గడిపాము," అన్నారు నాట్యకత్తెలు.

"అంటే?" అని కనుబొమలు ఎగుర వేశాడు సుశేముడు.

నాట్యకత్తెలు గ్రీకు సుందరికేసి చూశారు.

సుశేముడు చేయి ఊపడంతో గ్రీకు సుందరి అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

"ఇప్పుడు చెప్పండి. ఆ నీచుణ్ణి మీరు హతమార్చారా?" అని అడిగాడు సుశేముడు.



"తమరు మాకిస్తామన్న బహుమతి గురించి మరిచిపోలేదు కదా? మొదట ఆవిషయంచెప్పండి!" అన్నారు నాట్యకత్తెలు.

"అదేలా మరిచిపోగలను? మగధ సింహాసనం అధిష్ఠించగానే మీ కిస్తానన్న బహుమతిని రెండింతలు చేస్తాను! ఆ పరిచారికాపుత్రుణ్ణి ఎలా హతమార్చారో ఇప్పుడు చెప్పండి," అన్నాడు సుశేముడు పట్టరాని ఉత్సాహంతో.

"ఒక్కసారిగా హతమార్చడంకన్నా, గొప్పపని చేశాం. ఆహారంలో ఒకరకమైన విషం కలిపాం. దానిని భుజించడంతో అశోకుడు పక్షవాతంపాలై పడకనుంచి కదలలేకుండా పడి ఉన్నాడు?" అన్నారు నాట్యకత్తెలు.

"విషం కాస్త ఎక్కువ కలిపి, వాడి పీడ సొంతం విరగడ చేయలేకపోయారా?" అన్నాడు సుశేముడు కాస్త నిరుత్సాహంతో.

"ఆ పని చేసివుంటే మేము పట్టుబడి ఉండేవాళ్ళం. ఇప్పుడు మమ్మల్ని ఎవరూ అనుమానించలేదు. వెళ్ళిన పనీ జయప్రద మయింది. లేచి పడకమీద కూర్చోలేని వాడు సింహాసనం అధిష్ఠించగలడా?" అన్నారు నాట్యకత్తెలు.

"ఆహా! చాలా తెలివైన పనిచేశారు?" అంటూ సుశేముడు పట్టరాని సంతోషంతో మెడలోని రత్నాలహారం తీసి నాట్యకత్తెల కిచ్చాడు.

అంతలో ఎవరో తలుపు తట్టిన చప్పు డయింది.

"రావచ్చు!" అన్నాడు సుశేముడు.

సుశేముడి ప్రధాన అంగరక్షకుడు లోపలికి వచ్చి, "ప్రభూ! పాటలీపుత్రం నుంచి ఇద్దరు దూతలు వచ్చారు. వెంటనే తమరిని చూడాలంటున్నారు," అన్నాడు.

"రమ్మను," అన్నాడు సుశేముడు.

దూతలు వచ్చి సుశేముడికి నమస్క రించి, రెండు లేఖలు అందించారు. మొదటి లేఖ ప్రధానమంత్రీ, సేనాధిపతీ పంపినది. రాజు ఆరోగ్యం ఆందోళనక రంగా ఉందనీ వెంటనే రాజధానికి బయలుదేరి రమ్మనీ ఆ లేఖలో ఉన్నది. రెండవలేఖ ఆయన తల్లిగారు పంపినది. 'అశోకుడు నీ కన్నా ముందు రాజధానికి చేరి సింహాసనానికి పోటీపడే అవకాశం ఉంది. కాబట్టి తక్షణమే రాజధానికి బయలుదేరి రావాలి! ఆలస్యంచేయవద్దు.' అన్నది ఆ లేఖలోని సారాంశం!

రెండు లేఖలూ చదివిన సుశేముడు వాటి సందేశాలను తేలిగ్గా తీసుకుని, "అశోకుడికి మీరు పట్టించిన దుర్గతి గురించి అమాయకురాలైన మా తల్లికి తెలియదు పాపం! అనవసరంగా భయ పడుతున్నది!" అని బిగ్గరగా నవ్వి, "నేనేం త్వరపడనవసరం లేదు. రేపు నన్ను చూడడానికి ఒక గ్రీకు వర్తకుడు వస్తు న్నాడు. అతని సరుకులు తక్షశిలలో అమ్ముకోవడానికి అనుమతించాను. దానికి ప్రత్యుపకారంగా ఆమిత్రుడు నాకొక పెద్ద మణిని బహూకరించనున్నాడు!" అన్నాడు. -(ఇంకావుంది)





# మహాధన్యుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, లోకంలో ఏ ఒక్కరూ, అన్ని విషయాల్లోనూ పరిపూర్ణ పాండిత్యం కలవారై వుండరన్న సంగతి, ఒక దేశాన్నేలే రాజుగా, నీకు తెలియంది కాదు. ఆ కారణం వల్లనే రాజులు, మంత్రాలోచనకు గాను, ఒక్క రాజనీతి విషయాల్లోనే కాక, ఇతరేతరమైన ఐహికాముష్మిక విషయాల్లో కూడా ప్రజ్ఞావంతులైన వారిని సహాయకులుగా నియమించుకుంటారు. అయితే, ఈ సహాయకులు తమ మేధాశక్తికి అనుభవాన్నీ, గ్రంథపఠనంలో గడించిన జ్ఞానాన్నీ జోడించి, రాజుకు పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు చెప్పే ప్రమాదమున్నది. అలాంటి పరిస్థితుల్లో,

## బేతాళ కథలు



ఆ అభిప్రాయాల్లో ఎవరిది హేతుబద్ధమో, ఎవరిది కాదో నిర్ణయించుకోగల సూక్ష్మ గ్రాహ్యత రాజుకుండాలి. పూర్వం మహాధన్వుడనే రాజు పడిన బాధలకూ, ఆ తర్వాత పొందిన సుఖసంతోషాలకూ, మంత్రి ఒక కారణం చెబితే, గురువు మరొక కారణం చెప్పాడు. అలాంటి వారెవరైనా, నీ ఆస్థానంలోవుండి, నువ్వు ఈ అర్ధరాత్రి వేళ శ్మశానంలో పడుతున్న ఇక్కట్లకు కారణం అయ్యారేమోనన్న శంక కలుగుతున్నది. నీకు హెచ్చరికగా వుండేందుకు, ఆ మహాధన్వుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకప్పుడు నిషధదేశాన్ని మహాధన్వుడనే రాజు పాలించేవాడు. ఆయన తన పేరుకు తగ్గట్టే, గొప్పధనుస్సు కలిగి వుండాలని నిశ్చయించి, మంత్రిని పిలిచి, "మహాధన్వుడంటే గొప్పధనుస్సు కలవాడని అర్థంకదా! ఈ లోకంలో మరే మహారాజు దగ్గరా లేనంత గొప్ప ధనుస్సు నా దగ్గర వుండాలి. వెంటనే నేర్పరులను నియమించి, మహాభారం కలిగిన గొప్ప ధనుస్సును తయారు చేయించండి. అర్జునుడి గాండీవంలా, శ్రీరాముడి కోదండంలా, నాధనుస్సు ప్రసిద్ధికెక్కాలి," అని చెప్పాడు.

రాజంతవాడు తలచుకుంటే కాని పనులుండవుగదా! మంత్రిపిలుపు అందుకుని, ఎందరో ధనుర్నిర్మాణ కళాకారులు రాజధానీ నగరం చేరుకున్నారు. అటిని, కర్ణిక, శంఖము, స్కంధము, పల్లవము, లస్తకము - అనే ఆరు భాగాలతో శాస్త్రానుసారంగా నగిషీలు చెక్కిన మహాధనుస్సు ఒకదాన్ని తయారుచేశారు.

ఆ ధనుస్సును చూసి, అది అర్జునుడి గాండీవమంత బరువుందనీ, అటువంటి ధనుస్సు ఏ మహారాజు దగ్గరా లేదనీ అందరూ ప్రశంసించారు. మంచిరోజు చూసి అల్లెతాడు తగిలించి మహాధన్వుడు ఆ ధనుస్సు ధరించి ఎక్కుపెట్టి చూసి, మహాధన్వుడనే తన పేరు సార్థకమయ్యేలా అందరి ఆశీస్సులూ పొందాడు.

ఒకనాడు మహాధన్వుడు ధనుస్సు ధరించి అడవికి వేటకు వెళ్ళాడు. వేట సమయంలో ధనుస్సు, ఒక మహావృక్షపు బోదెకు కొట్టుకుని, వింటినారి తగిలించే కొటిక బీటతీసింది. రాజు తన భవనానికి తిరిగి వచ్చాక, నేర్పరులైన పనివారిచేత

బీట కనపడకుండా చక్కగా బాగుచేయించాడు.

ఈ సంగతి ఆయన మర్నాడు, తనకు ధనుర్విద్యనేర్పిన గురువుగారికి చెప్పాడు. గురువు ఆ ధనుస్సు పొడుగును ఒక ఈనెపుల్లతో కొలిపించాడు. తర్వాత ఒక చక్రం చుట్టి, అందులో పద్మాన్ని గీసి, ఆ ఈనెపుల్లను సమానమైన ముక్కలుగా కత్తిరించి, ఆ పద్మపురేకులలో ఆ ముక్కలను వేసి కంగారు పడ్డాడు.

తర్వాత ఆయన రాజుతో, "బాగాగమనించు, ఈపద్మపురేకులలో రెండు కోణాలున్నాయి. దీన్ని పద్మచక్రం అంటారు. ఈ ఈనెముక్కలు రెండు కోణాలలోని రేకులకు సరిపోతే, ధనుస్సుకు దోషంలేదని, ఈ పద్మచక్రం ఆధారంగా ధనుశ్శాస్త్రం చెపుతున్నది. ఈ శాస్త్రజ్ఞానంలో నా గురువు అధర్వణిని మించినవారు మరిలేరు! ఈ ఈనెముక్కలలో చివరిది, ప్రథమ కోణం వరకే సరిపోయింది. అంటే, ఈ ధనుస్సుకు ఔష్మిక దోషం కలిగిందన్నమాట. కనుక దీన్ని ధరించి తిరిగితే నువ్వు కష్టాలపాలు కాగలవు!" అన్నాడు.

గురువు చెప్పిన మాటలు సమంజసంగానేవున్నా, మహాధన్వుడు ధనుస్సు మీది మమకారం చంపుకోలేక దాన్ని ధరించడం మానలేదు. అయితే, కొద్ది రోజులకే శత్రురాజొకడు దండెత్తి వచ్చాడు. ఆ యుద్ధంలో ఔష్మిక దోషంగలధనుస్సు ధరించి మహాధన్వుడు, శత్రురాజుపై యుద్ధంచేసి ఓడిపోయాడు. శత్రువులకు బందీగాచిక్కి అవమానంపాలవడంఇష్టంలేక, యుద్ధభూమిని విడిచి గుర్రాన్ని అడవికేసి మళ్ళించాడు.

ఆయన అడవిలో చాలా దూరం ప్రయాణించి అలసిపోయి, ఒక చెట్టుకింద విచారంగా కూర్చున్నాడు. ఆసమయంలో





అడవిలో వుండే కోయవాళ్ళు ఆయన్ని చూసి, పరుగుపరుగున పోయి గూడెంలో వున్న తమ నాయకుడికి చెప్పారు.

కోయనాయకుడు వచ్చి రాజును గుర్తించి, "మహారాజా! రాజ్యాన్ని శత్రువులు ఆక్రమించారని విన్నాము. తమరు కొద్ది కాలం వుండండి. కొంత సద్దు మణిగాక, మా సాయంతో దండువెడలి రాజ్యాన్ని తిరిగి జయింతురుగాని," అన్నాడు.

కోయగూడెంలో అందరూ విల్లంబులు ధరించి తిరుగుతున్నారు. ఆడవాళ్ళు కూడా ధనుర్బాణాలు ధరించడం చూసి మహాధన్వుడు ముచ్చటపడ్డాడు. ఆయన కోయనాయకుడితో, "మీధనుస్సులు చాలా చిన్నవి. చూడండి! నాధనుస్సు మోయడం కూడా కష్టం," అంటూ చిన్నగా నవ్వాడు.

దానికి కోయనాయకుడు వినయంగా, "మహారాజా! తమరెరగనిది కాదు గదా! ప్రతిదానికీ శాస్త్ర పద్ధతి అంటూ ఒకటుంటుంది. మా జీవన విధానంలో విల్లు, అంబు తేలికగా వుండాలి. ఒక రథంమీదో, గుర్రంమీదో, ఏనుగుమీదో ఎక్కి యుద్ధం చేసే మీ ధనుస్సులు మాకు పనికిరావు. మీరనే ధనుస్సును మేము ఆత్మరక్షణ కోసం, వేటకూ ఉపయోగిస్తాం. ధనుర్ధారులన్న బిరుదు మాకు తగదు. మరొకసంగతి: మేము కూడా మాకున్న శాస్త్రప్రకారంగానే ధనుస్సు చేసుకుంటాం. వాటిలో లోపాలుంటే అవతల పారేస్తాం!" అన్నాడు.

అప్పుడు మహాధన్వుడు, తన ధనుస్సులో ఔష్మికదోషముందని చెప్పినగురువు మాటలు జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఆదోష ప్రభావం ఇంకా ఆయనను వదలలేదు. వారం తిరక్కుండానే శత్రురాజు సైన్యం కోయగూడెం మీదికి వచ్చిపడింది.

కోయల పరాక్రమం మీద గాని, వాళ్ళ యుద్ధకౌశల్యం మీదగాని నమ్మకం లేని మహాధన్వుడు, తన దురదృష్టాన్ని నిందించుకుంటూ, అక్కడి నుంచి మళ్ళీ పారిపోయి, అడవి దాటి ఒక ఊరి శివార్లలో వున్న పాడుబడ్డ దేవాలయం చేరుకున్నాడు.

కొద్దిసేపటికి మహాధన్వుడికి బాగా ఆకలి వేయసాగింది. ఇక ఆకలికి ఓర్చలేని మహాధన్వుడు, దేవాలయ మంటపం మీద తిరుగుతున్న పావురాలను పట్టుకోవాలని, తన ఉత్తరీయాన్ని విసిరాడు. విచిత్రంగా ఒకప్పుడు నిషధ దేశాన్ని పాలించిన నలమహారాజు కథలోలాగా,

పావురాలు ఉత్తరీయాన్ని ఎగరవేసుకు పోయాయి.

అది చూసి మహాధన్వుడికి ఉక్రోషం వచ్చింది. ఈ ధనుస్సు దోషంవల్లనే, తన కిన్ని కష్టాలన్న కోపంతో, ధనుస్సునుంచి ఒక బాణాన్ని దాపులనున్న పెద్దరాతికేసి కొట్టి, ధనుస్సును ముక్కలు ముక్కలుగా విరిచివేశాడు.

తర్వాత మహాధన్వుడు బాణం కొట్టిన రాయి వున్న ప్రదేశానికి వెళ్ళాడు. రాయి తునాతునకలై అక్కడ ఒక నేలమాళిగ కనిపించింది. అందులో వున్న నాలుగు పెట్టెలలో రత్నాలు, వజ్రాలు, బంగారు కాసులు వున్నాయి. రాజు వాటికేసి ఆనం దాశ్చర్యాలతో చూడసాగాడు.



ఇంతలో కోయనాయకుడు రాజు వెళ్ళిన జాడలుతీసుకుంటూ అక్కడకు వచ్చి, "మహారాజా! శత్రురాజు మా ధైర్య సాహసాలనూ, యుద్ధనైపుణ్యాన్నీ చాలా తక్కువగా అంచనావేశాడు. అడవిలోని గుట్టలమీదా, చెట్ల మధ్యా అశ్వసైన్యం ఎందుకూ పనికిరాదు. ఇక కాలిబంట్ల సంగతికొస్తే -ఈ అడవిలో పుట్టి పెరిగిన మా ఒక్కొక్క కోయధాటికి పదిమంది శత్రు కాలిబంట్లయినా నిలవలేరు. శత్రు రాజును బందీగా పట్టుకున్నాం!" అన్నాడు.

మహాధన్వుడు, కోయనాయకుణ్ణి మెచ్చుకుని, కోయలచేత నేలమాళిగ లోని ధనరాసులను పట్టించుకుని, హుటా హుటిని రాజధాని చేరాడు.

అప్పటికే రాజభవనం దగ్గర మంత్రీ, రాజగురువూ వున్నారు. మహాధన్వుడు వెంటతెచ్చిన ధనరాసులను చూసి మంత్రి, ఆయన నడిగి సంగతి తెలుసుకుని, "ప్రభూ! మీ పూర్వీకులలో ధనయజ్ఞు డనే రాజు చాలా యజ్ఞాలు చేశాడు. ఆయన ఒకసారి, మీరు చూసిన దేవా లయం దగ్గర ఒక యజ్ఞం చేసి, పేదసా దలకు పంచిపెట్టగా మిగిలిన ధనాన్ని, అక్కడ నేలమాళిగలో రహస్యంగా నిక్షిప్తం చేసి, అది కనబడకుండా రాతిని కప్పి, వానప్రస్థం వెళ్ళిపోయాడని చెప్పుకుం టారు. తర్వాత, ఎంత ప్రయత్నించినా, ఆ మహారాజు వారసులకు ఆ ధనం జాడలు తెలియలేదు. కాలక్రమేణా, ఈ విషయం మరుగునపడినా- ఈ నిధిని గురించిన సమాచారం, తండ్రి, తాతల కాలంనుంచి మంత్రిత్వ వారసత్వంగా

మా మెదడులలో నిక్షిప్తమై వుంది. ఆ నిధే ఇదని నేను ఘంటాపథంగా చెప్ప గలను. మీరు నిజంగా మహాధన్వులు! మీ ధనుస్సు కారణంగానే నిధి బయట పడింది," అన్నాడు.

ఇది విన్న రాజగురువు నవ్వి, "మహాధ న్వుడు ధనువు విరిచేసిన తర్వాతే, ఔష్మిక దోషంపోయి రాజ్యమేకాక, సంపద కూడా లభించింది!" అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మహాధన్వుడి మంత్రీ, గురువూ- ఇద్దరి కిద్దరూ మేధావులుగానే కనబడుతున్నారు. మంత్రి అభిప్రాయంలో, మహాధన్వుడి ధనుస్సు కారణంగానే, ఆయన పూర్వీకుడు ధనం నిక్షిప్తం చేసిన నేలమాళిగ బయట పడింది. ఇక, గురువు అభిప్రాయంలో, ఔష్మికదోషం గల, ఆ ధనుస్సును మహాధ న్వుడు విరిచి వేసిన తర్వాతే, ఆ నేల మాళిగ కంటబడింది. ఈ మంత్రి - గురువుల అభిప్రాయాల్లో ఏది సహేతుక మన్న సందేహం కలుగుతున్నది. ఈసందే హానికి సమాధానం తెలిసికూడా చెప్పకపో యావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కాలం, పరిస్థి తులప్రభావమే మనుషులకు కలిగే మేలు, కీడులకు కారణం. ఇది, లౌకిక విషయాల పట్ల నిశితమైన పరిశీలనాదృష్టి కలవాడే గ్రహించగలడు. మంత్రి లౌకికుడు; రాజ నీతిజ్ఞుడు. గురువు అలాకాక, తన గురువు లైన అధర్వణివద్ద, తను అధ్యయనం చేసిన శాస్త్రాలు స్థలకాలాలకు అతీతమైన నిత్యసత్యాలని నమ్మేవాడు. మహాధన్వుడు బాణంతో రాతిని కొట్టగానే నేలమాళిగ బయటపడింది. ఆ తర్వాతే ఆయన ధనుస్సును విరిచేశాడు. అంటే - గురువు చెప్పే ఔష్మికదోషం వున్న ధనుస్సే, మహా ధన్వుడికి తన పూర్వీకుడు నిక్షిప్తం చేసి పోయిన ధనరాసుల్ని ఇచ్చింది. ఈ సూక్ష్మాన్ని లౌకికుడైన మంత్రి గ్రహించాడు. శాస్త్రవాది అయిన గురువు గ్రహించలేక పోయాడు. ఈ కారణం వల్ల, మంత్రి అభిప్రాయమే సహేతుకమైనది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: జె.ఉదయనాగశిరీష రచన]





# అన్నదమ్ములు

ఒక వూళ్ళో పరంధామయ్య అనే ఆయన ఉండేవాడు. ఆయనకు ఇద్దరుకొడుకులు. ఇద్దరూ రత్నాల్లాంటి వాళ్ళు. పెద్దవాడి పేరు రామయ్యా, చిన్నవాడి పేరు లక్ష్మయ్యానూ.

వాళ్ళు నిజంగా రామలక్ష్మణులే. ఒక రంటే ఒకరికి పంచప్రాణాలు. తల్లిదండ్రుల పట్ల భక్తి గౌరవాలు చూపేవాళ్ళు. ఇద్దరూ పెద్దవాళ్ళయి పెళ్ళిచేసుకున్నారు. పెళ్ళాలు కాపరాలకు కూడా వచ్చారు.

కొంత కాలానికి వాళ్ళ తల్లి దండ్రులు పోయారు. అయినా ఆ అన్నదమ్ములు ఒకే కుటుంబంగా వుండి, తమపొలాన్ని కలిసే చేసుకుంటున్నారు. అన్న భోజనానికి వెళ్ళినప్పుడు తమ్ముడు పొలందగ్గిర ఉండేవాడు. తమ్ముడు భోజనానికి వెళ్ళినప్పుడు అన్న పొలం దగ్గిర కాపలా వుండేవాడు.

కాలం గడిచింది. రామయ్యకు సంతానం కలగలేదు. కాని తమ్ముడు లక్ష్మయ్య అయిదుగురు బిడ్డల తండ్రి అయ్యాడు.

ఈ తేడాతో బాటు వాళ్ళ పెళ్ళాల మధ్య ఇంటిపని చెయ్యటం విషయంలో కలతలు ఆరంభమయ్యాయి. తరచూ పోట్లాటలు జరిగేవి.

ఈ పోట్లాటలు వదిలించుకోవటానికి ఒకటే దారి కనిపించింది. అదేమిటంటే, ఇల్లూ, పొలమూ పంచేసుకుని, వేర్లు పడిపోవటం. రామయ్యా, లక్ష్మయ్యా ఆ పనే చేసేశారు. కాని వాళ్ళ మధ్య ఉండే ప్రేమాభిమానాలు మాత్రం ఏమీ చెడలేదు. పొలం దగ్గిర ఎప్పటిలాగే కలిసి మెలిసి ఉండేవాళ్ళు.

ఒక ఏడు పొలాలు విరగపండాయి. అన్నదమ్ములిద్దరూ పంటలు కోయించి,

కుప్పలు నూర్పించి, ధాన్యం రాసులు పోయించారు. ఇంక ధాన్యాన్ని ఇళ్ళకు చేర్చటమే తరవాయి అన్నమాట.

ఆ రాత్రి రామయ్య పొలంలో రామయ్యా, లక్ష్మయ్య పొలంలో లక్ష్మయ్యా కాపలా ఉన్నారు.

భోజనం వేళకు రామయ్య తన తమ్ముణ్ణి పిలిచి, "తమ్ముడూ, నేను ఇంటికి వెళ్ళి అన్నం తిని వస్తాను. అందాకా నా కళ్ళం కూడా కాస్త చూస్తూ ఉండు. నేను వచ్చినాక నువ్వు వెళుదువుగాని," అన్నాడు.

లక్ష్మయ్య సరేనని అన్నను పంపేశాడు. అప్పుడు లక్ష్మయ్యకు ఇలా ఆలోచన వచ్చింది. తనకు ముగ్గురు కొడుకులూ, ఇద్దరు కూతుళ్ళూ ఉన్నారు. తన పెద్ద కొడుకు ఎలాగూ రెండు మూడేళ్ళలో చేతికంది వస్తాడు. అప్పుడు తన పని చాలా తేలికవుతుంది. కాని, పాపం, తన అన్నకు పిల్లలు లేరు. వయసా పెరుగుతున్నది. పెద్దతనంలో సుఖపడాలంటే ఇప్పటి నుంచీ కొద్దికొద్దిగా వెనకేసుకోవలిసిన వాడు. ఆయనకు తను సహాయం చేస్తానంటే ఒప్పుకోడు. ఒకవేళ ఆయన ఒప్పుకున్నా తన పెళ్ళాం మాత్రం అసలు ఒప్పుకోదు.

ఇలా అనుకుని లక్ష్మయ్య గంపఒకటి తీసుకుని తన రాశిలోనుంచి పది గంపల ధాన్యం తన అన్న రాశిలో పోసేసి, ఏమీ ఎరగనట్టు తన మంచంఎక్కి కూర్చున్నాడు.

ఇంతలో రామయ్య భోంచేసి రానే వచ్చాడు. వచ్చి, లక్ష్మయ్యను భోజనానికి పంపాడు. లక్ష్మయ్య వెళ్ళాక రామయ్య ఆలోచనలో పడ్డాడు. ఈ యేడు పంట బాగానే పండింది. ఎంత పండినా లక్ష్మయ్య కేం లాభం? పెద్ద సంసారం. పిల్లలకు చదువులు, బట్టలు, ఖర్చు! తన దారి వేరు. తానూ, తన భార్యానూ! లక్ష్మయ్యకు సహాయం చెయ్యాలంటే ఈ ఏడు తనకు మంచి అవకాశం. కాని తాను ధాన్యం ఇస్తే వాడు తీసుకోడు. ఒకవేళ వాడు తీసుకున్నా తన పెళ్ళాం ఒప్పుకోదు. అందుచేత రామయ్య అటూ ఇటూ చూసి, లక్ష్మయ్య ఉపయోగించిన గంపతోనే పదిగంపల ధాన్యం తన రాశినుంచి తీసి తమ్ముడి రాశిలో పోసి ఏమీ ఎరగనట్టు కూర్చున్నాడు!



# పశ్చిమబెంగాల్ తీరం

రచన: మీరానాయర్ ◆ చిత్రాలు: గౌతంసేన్




దేవాలయాలకు ప్రసిద్ధిగాంచిన ఒరిస్సా నుంచి ఉత్తరంగా ప్రయాణం సాగించామంటే మహాపురుషులకూ, కవులకూ పుట్టినిల్లుగా ప్రసిద్ధిగాంచిన పశ్చమబెంగాల్ తీరం చేరుకుంటాం.

ఒరిస్సాకు ఆవల పశ్చిమ బెంగాల్ మిద్నపూర్ జిల్లా సముద్రతీరాన్ని కాంతి తీరం అని అంటారు. మిద్నపూర్ జిల్లా పశ్చిమబెంగాల్‌లోని రెండవ పెద్దజిల్లా. హుగ్లా తుంగతో అల్లిన నాణ్యమైన చాపలకు మిద్నపూర్ ప్రసిద్ధిగాంచింది. వరి సాగుకూ; అరటి, మామిడి, పనస ఫలాలకూ; కొబ్బరి దిగుబడికీ మిద్నపూర్ పేరుగాంచింది.

కాంతితీరంలో దీఘా ప్రసిద్ధిగాంచిన సముద్రతీర పర్యాటక కేంద్రం. ఒక వైపున ఎత్తయిన ఇసుక దిబ్బలతో ఎనిమిది కి.మీ. దూరం వ్యాపించి వున్న దీఘా తీరం మన దేశం లోని అందమైన సముద్ర తీరాలలో ఒకటి. ఆంగ్లేయులు దీనిని 'బీర్‌కూల్' అని పిలిచేవారు. బెంగాల్ మొట్టమొదటి గవర్నర్ వారన్‌హేస్టింగ్స్ దీనిని 'బ్రైటన్ ఆఫ్ ది ఈస్ట్' (తూర్పు బ్రైటన్) అని వర్ణించాడు.

కాంతి తీరం చివర హుగ్లీగా పిలువబడే గంగానది సముద్రంలో సంగమిస్తున్నది. చాలా వెడల్పూ, లోతూ గల ఈ నదిలో ప్రాచీనకాలం నుంచే నౌకల రాకపోకలు కొనసాగుతున్నాయి.

దీనికి కొంతదూరం ఎగువగా వున్న తామ్రలిప్తిగా పేరొందిన ఈ నాటి టామ్లుక్ దాదాపు క్రీ.పూ.

దీఘా తీరం




సుతానుతిలోని బోయ్‌తక్ - ఖానా

5-6 శతాబ్దాల నుంచే ప్రసిద్ధిగాంచిన ముఖ్యమైన రేవుపట్టణం.

బుద్ధ గయలోని బోధివృక్షం అంటుమొక్కను శ్రీలంకకు తీసుకుని వెళ్ళిన ఓడను సాగనంపడానికి అశోక చక్రవర్తి స్వయంగా ఈ రేవుకు వచ్చాడని చెబుతారు. గయలోని ఆ బోధివృక్షం కింద ధ్యానంలో ఉన్నప్పుడే గౌతమబుద్ధుడికి జ్ఞానోదయమయింది.

హుగ్లీ నదీ తీరంలో ఒకప్పుడు నిర్మానుష్యంగా ఉన్న గ్రామం సుతానుతి. నదిలో కొట్టుకు వచ్చిన రేగడి మన్ను, ఓడల రాకపోకులకు అంతరాయం కలిగించడం వల్ల, వర్తకులు సుతానుతిలోనే వ్యాపారం మొదలు పెట్టారు. బ్రహ్మాండమైన ఒక రావి వృక్షం నీడలో కూర్చునేవారు. దానిని 'బోయ్‌తక్-ఖానా' అనేవారు. వ్యాపారులు చెట్టు నీడన కూర్చుని హుక్కా పీలుస్తూ వ్యాపారం సాగించేవారు. 1690వ సం॥ ఆగస్ట్ నెలలో ఒక ఆదివారం ఈస్ట్ఇండియా కంపెనీ ప్రతినిధి జాబ్ చార్నాక్ అక్కడికి వచ్చాడు. ఆ ప్రదేశం అందానికి ముగ్ధుడై అక్కడే కంపెనీ గిడ్డంగిని నిర్మించాలని నిర్ణయించాడు. (అక్కడున్న వృక్షాన్ని 1820వ సం॥లో వారన్ హేస్టింగ్స్ నరికించేశాడు).

జాబ్ చార్నాక్ ఔరంగజేబు వారసులనుంచి అనుమతి పొంది **సుతానుతి, గోవిందపూర్, కాలికట్ట** అనే మూడు గ్రామాలను కలిపి ఈనాటి కలకత్తా నగరాన్ని ఏర్పరచాడు.

చార్నాక్ కలకత్తా నగరం మొదటి గవర్నర్ అయ్యాడు. భర్త మరణించినప్పుడు ఆయన చితిమీదే సహగమనం చేయడానికి పూనుకున్న ఒక భారతీయ మహిళను కాపాడి, చార్నాక్ ఆమెనే వివాహమాడాడు. ఆయన శేషజీవితం కలకత్తాలోనే గడిపి, అక్కడే మరణించాడు. ఆయన సమాధి సెయింట్‌జాన్స్ చర్చ్‌లో ఇంకా ఉన్నది.

కాలికట్ట అన్నదే ఆంగ్లేయులనోట క్రమంగా కలకత్తాగా మారిందని చెబుతారు. సున్నపు బట్టీలను బెంగాలీలో కల్‌కట్ అని అంటారు. ఒకప్పుడు ఈ ప్రాంతంలో సున్నపు బట్టీలు ఎక్కువగా ఉండడం వల్లనే దీనికి కలకత్తా అనే పేరు వచ్చిందని మరికొందరు చెప్పుకుంటారు.

మనదేశంలోని 11 ముఖ్యమైన రేవులలో కలకత్తా రేవు ఒక్కటే నదిమీద ఉన్నది. ఇది సముద్రానికి 232 కి.మీ. దూరంలో ఉన్నది.


సెయింట్‌జాన్స్‌చర్చ్‌లోని జాబ్‌చార్నాక్ స్మారకచిహ్నం

ఈ రేవులో ఓడప్రయాణానికి తరచూ అంతరా యాలు కలుగుతూ ఉంటాయి. వాటిని క్రమం తప్పకుండా తొల గిస్తూ ఉండాలి. రోజూ నదిలోని నీటి లోతు మారుతూ ఉంటుంది. కాబట్టి దానిని నిరంతరాయంగా పర్యవేక్షిస్తూ తగిన చర్యలు తీసు కుంటూ ఉండాలి. ఈ ఇబ్బందుల కారణంగా 1977వ సం॥లో హాల్దియా రేవును నిర్మించారు. ప్రపంచంలో అతిపెద్ద 'లాక్ ఎంట్రెన్స్' కలిగిన రేవులలో హాల్దియా రేవు ఒకటి.



రవీంద్ర సేతు

1943వ సం॥ వరకు కలక త్తాను హౌరాతో 'హౌరావంతెన' కలుపుతూ ఉండేది. పశ్చిమ బెంగాల్‌లోని అతిచిన్న జిల్లా హెూరా అని పిలువబడే హౌరా. మితిమించిన వాహనాల, జనం రద్దీ కారణంగా 'రవీంద్రసేతు' వంతెనను నిర్మించారు. ఇది మనదేశంలోని అతిపెద్ద 'కాంటిలివర్ బ్రిడ్జ్. 'దీని పొడవు 475 మీ. 8 వాహన మార్గాలు 2 కాలిమార్గాలు గల ఈ వంతెన ప్రపంచంలో చాలా రద్దీ అయిన వంతెనలలో ఒకటి.

హౌరాలోని శివపూర్ 'బొటానికల్ గార్డెన్స్' 1786వసం॥లో ఏర్పాటుచేయబడింది. 24.4మీ॥ ఎత్తు 366మీ॥ చుట్టుకొలత గల బ్రహ్మాండమైన మర్రివృక్షం ఇక్కడ చాలా ప్రసిద్ధిగాంచింది. వృక్షపు ప్రధానబోదె పాడైనప్పటికీ వేలాది ఊడలు చాలా దృఢంగా ఉన్నాయి. ఇంకా కొత్త కొత్త ఊడలు చిగురిస్తున్నాయి.

ఈ ఉద్యానంలో 2000 లకు మించిన విచిత్రమైన మొక్కలు ఉన్నాయి. అమెజాన్‌కు చెందిన జెయింట్ వాటర్ లిల్లీస్, మొలుకాస్‌కు చెందిన నట్‌మెగ్ చెట్లు, పశ్చిమ ఆఫ్రికాకు చెందిన నలభైయేళ్ళకు ఒకసారి ఒకే పువ్వు పూచే కారిఫా ఎలాటా వంటి అరుదైన జాతి చెట్లు ఉన్నాయి.



బొటానికల్ గార్డెన్స్‌లోని బ్రహ్మాండమైన మర్రివృక్షం

ఈ ఉద్యానంలోని సెంట్రల్ నేషనల్ హెర్బేరియంలో 2.5మిలియన్ అరుదైన ఎండు మొక్కలు; వృక్షశాస్త్రం, ఆటవిక శాస్త్రం, కీటక శాస్త్రం, భూతత్వ శాస్త్రం, వ్యవసాయం మొదలైన విభాగాలకు చెందిన అమూల్య మైన పుస్తకాలు, పత్రికలు,వ్రాత ప్రతులుభద్రపరచబడిఉన్నాయి.

హౌరాకు ఉత్తరంగా ఉన్న బేలూరులో రామకృష్ణ మిషన్ అంతరర్జాతీయ ప్రధాన కార్యా లయంఉన్నది. 19వశతాబ్దంలో సర్వమత సమైక్యతను ప్రబోదిం



దక్షిణేశ్వర కాళి ఆలయం

చిన మహాపురుషుడు శ్రీరామ కృష్ణ పరమహంస ఆయన ప్రధాన శిష్యుడైన స్వామి వివేకానంద దీనిని 1899వ సం॥లో స్థాపించాడు.

శ్రీరామకృష్ణ పరమహంస ప్రభోదించిన సర్వమత సమైక్యతా విశ్వాసానికి అనుగుణంగానే బేలూరు మఠంలోని ఆలయం నిర్మించబడింది. దేవాలయం, చర్చ్, మసీదు శిల్ప నిర్మాణాల కలయికతో ఈ ఆలయం నిర్మించబడింది.

హుగ్లీనదికి ఆవలిగట్టున దక్షిణేశ్వర కాళి ఆలయం ఉన్నది. ఈ ఆలయంలో పూజారిగా ఉన్నప్పుడే శ్రీ రామకృష్ణ పరమహంసకు సర్వమత సమైక్యతా దృష్టి ఏర్పడి, అనుభవంలోకి వచ్చినట్టు చెబుతారు. ఈ ఆలయం 1847వ సం॥లో నిర్మించబడింది.

దక్షిణేశ్వరానికి దక్షిణంగా కుమర్తులి అనే కుంభకారుల ప్రాంతం ఉన్నది. ఇక్కడి కుంభకారులుమట్టితో అందమైన దుర్గ బొమ్మలు చేయడంలో సిద్ధహస్తులు. దుర్గాపూజ సమయంలో తయారుచేసే నిలువెత్తు దుర్గామాత విగ్రహాలకు ఆకర్షణీయమైన రంగులు అద్దుతారు. ఉత్సవం ఆఖరిరోజున విగ్రహాలను పవిత్ర నదీజలాలలో నిమజ్జనం చేయాలి గనక, వాటిని కాల్చరు.

కలకత్తా ప్రాంతంలో సెప్టెంబర్ – అక్టోబర్ నెలల మధ్య దుర్గాపూజను ఘనంగా జరుపుకుంటారు.

హిమవంతుడి పుత్రిక అయిన దుర్గ (పార్వతి) పరమశివుణ్ణి వివాహమాడాలనుకున్నది. కాని అది ఆమె తల్లి మేనాదేవికి నచ్చలేదు. తన బిడ్డ శివుణ్ణి వివాహమాడితే సుఖపడజాలదని ఆమె భావించింది. కాని పార్వతి మాత్రం పరమ శివుణ్ణి వివాహమాడాలన్న పట్టుదలతో ఆయన్ను మెప్పించడానికి కఠోరమైన తపస్సుకు పూనుకున్నది. ఆమె భక్తికి మెచ్చి శివుడామెను వివాహమాడి కైలాసానికి తీసుకు వెళ్ళాడు. కని, పెంచిన బిడ్డ దూరం కావడంతో ఆమె తల్లి దండ్రులు విచారగ్రస్తులయ్యారు. తల్లిదండ్రుల విచారం పోగొట్టడానికి, దుర్గాదేవి యేటా ఒకసారి పుట్టింటికి రాసాగింది. దుర్గా దేవి పుట్టింటికి వచ్చే ఆనంద సందర్భాన్ని పురస్కరించుకుని ఏర్పడిందే దుర్గా పూజ అని పలువురు బెంగాలీలు విశ్వసిస్తారు.



దుర్గామాత మట్టివిగ్రహం



# నీటబడిన చినుకు

సీతాపురం సంస్థానంలో జోగీంద్రుడనే కవి ఉండేవాడు. చమత్కారంలో ఆయనకు ఆయనే సాటి అని పేరు. సంస్థానాధికారి చపలుడికి హాస్యం గురించిబొత్తిగా తెలియదు. జోగీంద్రుడేం మాట్లాడినా తనను వెటకారం చేస్తున్నట్టే భావించేవాడు.

అధికారి ఇలా అనుకుంటున్నాడని జోగీంద్రుడికితెలుసు. అయినా తన చమత్కారగుణాన్నాయన మానుకోలేదు. అందువల్ల రోజురోజుకూ చపలుడికి, జోగీంద్రుడిపట్ల ద్వేషభావం పెరిగిపోసాగింది.

కవులకు అన్యాయం చేసే అధికారికి చెడ్డపేరు వస్తుందని చపలుడికి తెలుసు. అందువల్ల, ఆయన జోగీంద్రుణ్ణియిబ్బంది పెట్టడానికి ఇతరమార్గాలన్వేషించేవాడు. జోగీంద్రుడికి సంస్థానం ఇచ్చిన మాన్యం పదెకరాలుంది. దాని మీద నూరు బస్తాల ధాన్యం వచ్చేది. ఒక ఏడాది పంటసరిగా పండలేదని రైతు కల్లబొల్లి మాటలుచెప్పి, పదిబస్తాల ధాన్యం ఇచ్చాడు. చపలుడు రైతుచేత అలా చెప్పించాడని తెలియక, జోగీంద్రుడు అదే పుచ్చుకున్నాడు.

సభలో చక్కని కవిత్వం చదివినప్పుడూ, ఇతర సంస్థానాలపండితులువచ్చినప్పుడూ, ఆస్థానకవికి బంగారు కాసులు కానుకలిచ్చే సంప్రదాయముండేది. చపలుడు దానికి స్వస్తి చెప్పి జోగీంద్రుడికి బిరుదులిచ్చే వాడు. పండిత శాలువాలు కప్పేవాడు. అందమైన శిల్పాలను బహూకరించేవాడు.

ఇవన్నీ చేసి, "సామాన్యులకు ఇలాంటివిస్తే విలువ తెలియక అమ్ముకుంటారు. అపురూపంగా దాచుకుని, అందరికీ చూపించుకుంటారనే నేను జోగీంద్రుడికివి ఇస్తున్నాను," అని చెప్పేవాడు.

ఇలా కొంతకాలం జరిగేసరికి జోగీంద్రుడికి డబ్బు ఇబ్బంది మొదలయింది.

"వసుంధర"



అలాంటి సమయంలో, జ్యోతిపురం సంస్థానం నుంచి విదురుడనే పండితుడు వచ్చి చపలుణ్ణి మెప్పించాడు. చపలుడు, విదురుణ్ణి నీకేం కావాలో కోరుకోమన్నాడు.

"ప్రభూ! మీ ఆస్థానకవి జోగీంద్రుడు అసమాన ప్రతిభావంతుడు. ఆయనగొంతు తన సభలో ఒకసారి పలకాలని, మా సంస్థానాధీశుడు జగపతి కలవరిస్తున్నాడు. జోగీంద్రుణ్ణి నాతో పంపమని, నా కోరిక," అన్నాడు విదురుడు.

చపలుడాశ్చర్యపడి, "ఎవరైనా మణులు, మాన్యాలుకోరతారు. ధనకనక వస్తు వాహనాలు కోరతారు. నువ్వు ఇలాంటి కోరిక కోరడం విడ్డూరంగా వుంది. జోగీంద్రుణ్ణి నీతో పంపడానికి, నాకేమీ అభ్యంతరముండదు కాబట్టి, ఇంకేమైనా కోరుకో," అన్నాడు.

దీనికి విదురుడు, చపలుడికి వినయంగా నమస్కరించి, "మా ప్రభువుల దయవల్ల నాకు దేనికీ లోటులేదు.వేరొక సంస్థానం నుంచి ధనాన్నాశించడం, మా సంస్థానానికి గౌరవప్రదం కాదు. కాబట్టి ధనం విషయంలో నన్ను బలవంత పెట్టవద్దు," అన్నాడు.

జోగీంద్రుడిప్పుడు డబ్బు అవసరంలో వున్నాడు. విదురుడితో జగపతి సంస్థానానికి వెళితే, తప్పక డబ్బడుగుతాడు. అదితన సంస్థానానికి గౌరవప్రదం కాదు! ఇలా ఆలోచించి చపలుడు, "ఇంతకూ జగపతి, జోగీంద్రుడి నుంచి ఏమాశిస్తున్నాడు?" అని అడిగాడు.

"ప్రభూ! మా సంస్థానంలో కళాపోషణ గొప్పగా జరుగుతున్నది. పౌరులు సుఖంగా వున్నారు. నేరాలనేవి నశించిపోయాయి. రోగబాధలులేవు. ఇవన్నీ స్వయంగా గమనించాక, ఇందుకు మా సంస్థానా ధీశుణ్ణి పొగుడుతూ పద్యాలు చెప్పడం కోసమే, జోగీంద్రుణ్ణి నా వెంట తీసుకుని వెళుతున్నాను," అన్నాడు విదురుడు.

జోగీంద్రుడు ఆత్మగౌరవం గల మనిషి డబ్బుకోసం ఎవరినీ పొగడడు. దేహీఅని యాచించడు. ఈవిషయంచపలుడికిబాగా తెలుసు. అందుకని, "నాకేమీ అభ్యంతరం లేదు. అంతా జోగీంద్రుడిష్టం," అన్నాడు.

అయితే చపలుడు ఆశ్చర్యపడేవిధంగా, జోగీంద్రుడు జ్యోతిపురం సంస్థానానికి వెళ్ళేందుకు అంగీకరించాడు. అప్పుడు చపలుడు తెలివిగా, "పండితోత్తమా! నువ్వు నీ సంస్థాన గౌరవాన్ని కాపాడిన విధంగానే,

జోగీంద్రుడు తనసంస్థాన గౌరవాన్ని కాపాడు కుంటాడు. నువ్వుగానీ, జగపతిగానీ అభ్యం తరం పెట్టకూడదు," అన్నాడు.

ఆ మాటల్లో తనకు హెచ్చరిక వున్నట్లు జోగీంద్రుడు గ్రహించాడు.

విదురుడితో వెళ్ళిన జోగీంద్రుడికి, జగపతి సంస్థానం ఎంతో నచ్చింది. ఆయన పాలన చాలా బావున్నట్టు కనిపించింది. సభలో ఆయన జగపతిని మెచ్చుకుంటూ ఎన్నో పద్యాలు చదివాడు.

జగపతి చాలా సంతోషించి, జోగీంద్రుణ్ణి ఏం కావాలో కోరుకోమన్నాడు.

"ప్రభూ! పండితులు కోరితే ప్రభువులు తీర్చడం ధర్మం. కవులకు కోరికలు ధర్మ సమ్మతం కాదు. నా కవిత్వాన్ని తమరే విధంగా సన్మానించాలనుకుంటే అలా చేయండి," అన్నాడు జోగీంద్రుడు. జగపతి, జోగీంద్రుడికి ఒకపట్టు వస్త్రపు సంచిలో కొన్ని మంచి ముత్యాలను ఇచ్చి, "ఇది నా శక్తికొద్దీ చేయగలిగినది. తమరి అర్హతకు తూగగల శక్తి నాకు లేదు. మన్నించండి!" అన్నాడు.

జోగీంద్రుడు సంతోషంగా అక్కడినుంచి తిరుగు ప్రయాణమయ్యాడు. సీతాపురం సంస్థానం చేరుకున్నాక చపలుడాయనను స్వయంగా కలుసుకుని, వెంట తెచ్చుకున్న మేలి ముత్యాలను చూశాడు. వాటిల్లో నాలుగోవంతు అమ్ముకుంటే జోగీంద్రుడి వంశానికి కొన్ని తరాలపాటు లోటుండదని ఆయనకు అర్థమయింది.

"విదురుడు నా వద్ద డబ్బుతీసుకుంటే తన సంస్థానానికి అవమానమన్నాడు. అతడికి తన సంస్థానమంటే అంతగౌరవం వుంది. నువ్వు జగపతి ఇచ్చిన కానుకలందుకుని, మన సంస్థానానికి చెడ్డపేరు తెచ్చావు," అన్నాడు చపలుడు నిష్ఠూరంగా.



ఇందుకు జోగీంద్రుడు, "ప్రభూ! తమరు పొరబడుతున్నారు. నేను మన సంస్థానపు కీర్తి పెంచానే తప్ప కించపరచలేదు. నా వంటి కవి తన సంస్థానంలో లేడనే కదా, జగపతి నన్ను తన ఆస్థానానికి పిలిపించు కున్నాడు! ధన కనక వస్తు వాహనాలకంటే విలువైనవాడిననే కదా, విదురుడు వాటికి బదులు నన్నుకోరాడు! జ్యోతిపురం సంస్థా నంలో కోరడానికి, నా వంటికవి లేనేలేడు కదా! ఉంటే, నేనూ కోరి అటువంటివాణ్ణి మన సంస్థానానికి వెంటబెట్టుకు వచ్చే వాణ్ణి. ఇలా ఆలోచించి చూస్తే నేను వెళ్ళడం వల్ల అన్ని విధాలా మన సంస్థానం కీర్తి పెరిగింది," అన్నాడు.

"అంటే, మనసంస్థానపు కీర్తంతా నీతోనే వుందంటావా? నువ్వు అహంకారివి. కాదం టావా?" అన్నాడు చపలుడు కోపంగా.

"అహంకారి ఇతరులనుపొగడడు. నేను జ్యోతిపురం సభలో నన్ను మరిచి జగపతిని పొగిడాను," అన్నాడు జోగీంద్రుడు.

"నువ్వు ధనాశాపరుడివి. డబ్బుకోసం జగపతిని పొగిడావు," అన్నాడు చపలుడు మరింత కోపంగా.

"ప్రభూ, నేను జగపతిని పొగిడితేఅది కవిత్వమయింది. ఆ కవిత్వం జగపతిని తాకి మంచి ముత్యాలుగా మారింది. నా ముత్యాలు నేను తెచ్చుకున్నాను. ఇందులో జగపతి ఇచ్చిందీలేదు, నేను పుచ్చుకున్నదీ లేదు." అన్నాడు జోగీంద్రుడు.

"నీకు ధనాశ లేకపోతే, అహంకారం లేకపోతే - ఇక్కడ నన్నెందుకు పొగడవు? ఆ కవిత్వం ఇక్కడే ఎందుకు చెప్పవు?" అని అడిగాడు చపలుడు.

"ప్రభూ! ఎక్కడైనా నేనుకవిత్వం చెబు తూనే వుంటాను. నా పద్యాల చినుకులు మన సంస్థానంలోనూ, జ్యోతిపురం సంస్థా నంలోనూపడ్డాయి. నీటపడినచినుకు నీట కలిసింది. చిప్పన బడ్డ చినుకు ముత్యమ యింది!" అన్నాడు జోగీంద్రుడునిదానంగా.

అప్పటికి చపలుడికి అర్థమయింది- జోగీంద్రుడుచమత్కారంగా తనను గురించి వివరించాడని! కవుల చమత్కారంతో వివేకాన్ని పెంచుకుని వ్యవహరించాలే తప్ప, నిరసించి ప్రయోజనముండదని తెలుసుకున్నాక క్రమంగా చపలుడుకూడా జగపతిలాగే కళాపోషకుడు కాగలిగాడు.





అంగ్లేయులను ఎదిరించిన యోధులు ②

# సన్యాసి-ఫకీరుల తిరుగుబాటు

రచన : మీరా ఉగ్రా ◆ గౌతమ్ సేన్

17వ శతాబ్దాంతంలో గోసాయిలు, గిరిలు అనే సన్యాసుల బృందం తీవ్రవాదుల దండుగా రూపొందింది. క్రమేణా వాళ్ళు సంస్థానాధీశుల తరఫున యుద్ధాలు చేయసాగారు. మొగలు సామ్రాజ్య పతనానంతరం దేశంలో అలజడి ఏర్పడి శాంతి భద్రతలు కరువయ్యాయి. ఆ పరిస్థితిని ఎదిరించి పోరాడే వీరులుగా సన్యాసులు తయారయ్యారు. ధనికులను దోచుకుని పేదసాదలకు పంచిపెట్టేవారు. వాళ్ళు అన్యాయాలనూ, దోపిడీనీ ఎదిరించి పోరాడసాగారు.

ఫకీర్లకు అటు ముస్లింల మధ్యా, ఇటు హిందువుల మధ్యా గౌరవాదరాలు లభించాయి. ఆరంభంలో వాళ్ళు సహనాన్ని బోధించినప్పటికీ, ఆ తరవాత తీవ్రవాదులుగా మారి దుర్మార్గాలనూ, దురన్యాయాలనూ ఎదిరించడానికి హింసాదౌర్జన్యాలను ప్రబోధించారు.

ఈ సన్యాసులూ, ఫకీర్లూ 18వ శతాబ్దంలో బీహర్ - బెంగాల్ ప్రాంతాలలో ఈస్ట్ ఇండియా కంపెనీ దురాగతాలను ఎదిరించి పోరాటం సాగించారు.

గోసాయి హిమ్మత్ గిరి, 1764 అక్టోబర్ 22వ తేదీ జరిగిన బక్సర్ యుద్ధంలో మీర్ ఖాసిం పక్షంలో చేరి ఈస్ట్ ఇండియా కంపెనీ సేనలతో యుద్ధం చేశాడు. యుద్ధంలో ఓటమి సంభవించగానే -




సన్యాసులు కంపెనీ ఫ్యాక్టరీల మీద పడి అక్కడి ఆయుధాలనూ, యుద్ధసామగ్రినీ ఎత్తుకుపోయారు.



బ్రిటిష్ సేనలు ఏమీ చేయలేక పోయాయి.



1770 లలో మజ్నూన్‌షా అనే ఫకీరు, ఉత్తర బెంగాల్‌లోని కొన్ని ప్రాంతాలలో అధికారం చేపట్టాడు.




ముజ్నూన్ షా బ్రిటిష్ వాళ్ళతో పోరాడి మరణించిన తరవాత ...



... ఆయన కుమారుడు చిరాఘ్ అలీ, ఆయన పనిని కొనసాగించాడు. భవానీ పాఠక్, దేవీ చౌధురాణి ఆయనకు బాసటగా నిలిచారు. ఆ ఇద్దరూ గొప్ప యోధులుగా ప్రసిద్ధి గాంచారు.



వాళ్ళు ధనికులైన జమీందారులను దోచుకునే వారు. ఒకనాడు –






వాళ్ళకోసం పడవ సిద్ధంగా కాచుకుని ఉన్నది.. వాళ్ళు తొందరగా అందులోకి దూకి...

.... వేగంగా వెళ్ళిపోయారు. సైనికులు వాళ్ళను వెంబడించారు.

అదిగో అక్కడున్నారు! వేగంగా! వేగంగా!

అయినా=

వాళ్ళు మాయమై పోయారు!

ఇక వెనుదిరగడం మంచిది!

చాలా సమీపంలోకి వచ్చినా, పట్టుబడకుండా తృటిలో తప్పించుకున్నారు.

1788వ సం॥లో భవానీ పాఠక్ తన అనుచరులు కొందరితో పట్టుబడ్డాడు. ఆంగ్లేయులు అతన్నిహతమార్చారు.

ఇప్పుడు .... దేవీ చౌధురాణిని పట్టుకోవాలి!

దేవీ చౌధురాణి మరి కొంతకాలం పోరాటం కొనసాగించి, హఠాత్తుగా తన కార్యకలాపాలకు స్వస్తి పలికింది.

.... ఆ తరవాత ఆమె ఉన్న చోటు తెలియకుండా కనుమరుగై పోయింది. ఆమె ఏమయిందో ఎవరికీ తెలియదు.

అయినా, ఉద్యమం కొనసాగింది. సుసాంగ్ పరగణాలో, కరంషా అనే ఫకీరు ఉత్తేజకరమైన తన ఉపన్యాసాల ద్వారా పలువురిని ఆకర్షించాడు.




ఆయన తన సంస్థకు **పాగల్ పంథీల్** అని పేరు పెట్టాడు. 1813వ సం॥లో కరంషా మరణానంతరం ఆయన కుమారుడు టిప్పు షా ఆ సంస్థను నడిపించాడు.




1825వ సం॥లో **పాగల్ పంథీలు** షెర్పూర్ జమీందారీలోని గర్ జరిపాను పట్టుకుని తమ సొంత ప్రభుత్వాన్ని నెలకొల్పారు. అది రెండేళ్ళు కొనసాగింది.




1826వ సం॥లో జమాల్పూర్‌కు బ్రిటిష్ సేనలు పెద్ద సంఖ్యలో వచ్చాయి... సైనికులు టిప్పు షా కోసం గ్రామాలనూ, పరిసర అరణ్యాలనూ గాలించారు. అఖరికి 1827లో ఆయన్ను పట్టుకుని యావజ్జీవ కారాగారశిక్ష విధించారు.

సన్యాసి - ఫకీరుల ఉద్యమాన్ని అణగద్రొక్కడానికి బ్రిటిష్ ప్రభుత్వం కఠినచర్యలు తీసుకున్నది. వాళ్ళు ఉత్తర భారత దేశంలో బృందాలుగా ప్రయాణించడం నిషేధించింది. బంకిం చంద్ర ఛటర్జీ 'ఆనందమఠం' నవల రాయడానికి సన్యాసుల తిరుగుబాటు ప్రేరణ కలిగించింది. ఆ నవలలోనే ఆయన ఉత్తరోత్తరా 'వందేమాతరం' గీతాన్ని నిక్షిప్తం చేశాడు.






సభలో భీష్ముడూ, కృపాచార్యుడూ దుర్యోధనుడికి హితబోధ చేసిన మీదట త్రిగర్త రాజూ, రథబలాలకు నాయకుడూ అయిన సుశర్మ దుర్యోధనుడితో ఇలా అన్నాడు: "మత్స్యదేశపురాజు నా దేశాన్ని చాలాసార్లు చీకాకు పరచాడు. అమిత బలవంతుడైన అతని సేనానాయకుడు గంధర్వుల చేతిలో చచ్చాడు. ఇప్పుడు మత్స్యదేశానికి నాథుడు లేడు. మీరు కోరినట్టయితే ఆ దేశంమీద యుద్ధానికి పోదాం. కౌరవులూ, త్రిగర్తులూ కలిసి వెళ్ళినట్టయితే మత్స్య దేశం లొంగిపోతుంది. కావలిసినంత ధనమూ, రత్నాలూ, అంతులేని ఆవుల మందలూ కొల్లగొట్టవచ్చు. వాటితో నీ బలం వృద్ధి అవుతుంది. నాదేశానికి శత్రు బాధ పోతుంది."

సుశర్మ చెప్పిన ఆలోచనను కర్ణుడు బలపరిచాడు.

దుర్యోధనుడు తన తమ్ముడైన దుశ్శాసనుడితో, "సైన్యాన్ని సిద్ధం చెయ్యి. సుశర్మ త్రిగర్తసేనలతో ఒక పక్క నుంచి మత్స్య దేశం మీద దాడి చేసి ఆవుల మందలను పట్టుకుంటాడు. మర్నాడు మనం మరొక పక్కనుంచి దాడిచేద్దాం," అన్నాడు.

ఈ పథకం ప్రకారం కృష్ణసప్తమినాడు సుశర్మ తన బలాలతో మత్స్యదేశం మీదికి దండయాత్ర బయలుదేరాడు. అష్టమినాడు కౌరవసేనలు కదిలాయి.

ఈ లోపల విరాటనగరంలో రహస్యంగా జీవిస్తున్న పాండవుల గడువు పూర్తి అయింది. కీచకుడు చచ్చినాక విరాటుడు కుక్కిన పేనులాగా ఉన్నాడు.

ఇంతలో సుశర్మ సేనలు విరాటుడి గోవుల మందలను చుట్టుముట్టి పట్టుకున్నాయి. త్రిగర్తులు వచ్చి లక్షల సంఖ్యలో గోవుల మందలను వశపరుచుకున్నారనీ

## 41. గోగ్రహణం



నను ప్రాణాలతో పట్టుకున్నాడు. సేన చీకాకుపడిపోయింది.

అప్పుడు ధర్మరాజు భీముణ్ణి యుద్ధానికి వెళ్ళి విరాటరాజును విడిపించుకు రమ్మనీ, యుద్ధం చేసే పద్ధతిలో భీముడన్న సంగతి బయటపడకుండా జాగ్రత్త పడమనీ హెచ్చరించాడు. భీముడు సుశర్మను ఎదిరించి యుద్ధం చేసి, అతన్ని చితకపొడిచి, బంధించి పట్టుకుని, విరాటుణ్ణి విడిపించాడు. భీముడు పట్టితెచ్చిన సుశర్మను ధర్మరాజు విడిపించాడు.

తాను గెలిచినట్టు విరాటనగరానికివార్త పంపి, విరాటుడు తన గోవుల మందలను మళ్ళించుకుంటూ ఉన్న సమయంలో దుర్యోధనుడు బ్రహ్మాండమైన సేనతోనూ, భీష్మ, ద్రోణ, కర్ణ, శకుని, దుశ్శాసన, అశ్వత్థామ మొదలైన మహావీరులతోనూ మరొక పక్కనుంచి మత్స్యదేశంలోకి జొరబడి అక్కడి గోవుల మందలను పట్టాడు.

వారిని ఎదిరించి గోవుల మందలను, కాపాడుకోవలసిందనీ గోపాలకుల నుంచి విరాటుడికి వార్త వచ్చింది.

వెంటనే విరాటుడు తన సైన్యాన్ని ఆయత్తపరచి, తన తమ్ములైన శతానీకుడూ, మదిరాక్షుడూ మొదలైన వీరులతో యుద్ధ సన్నద్ధుడైనాడు. తన వద్ద ఉన్న పాండవులలో ధర్మరాజూ, భీముడూ, నకుల సహదేవులూ యుద్ధం చెయ్యగలిగే ఉంటారనుకుని విరాటుడు వారికోసం కూడా నాలుగు రథాలు సిద్ధంచేయించాడు.

విరాటుడి సేనలు త్రిగర్త సైన్యాన్ని కలుసుకునే సరికి చాలా పొద్దెక్కింది. ఇరు పక్షాలకూమధ్య తీవ్రమైన యుద్ధం జరుగుతూండగా చీకటిపడింది. ఆ సమయంలో సుశర్మ విరాటుడితో యుద్ధంచేసి, ఆయ

గోపాలకులపెద్ద ఈ వార్త తెలపటానికి రథంమీద విరాటనగరానికి వెళ్ళి, భూమింజయుడనే రాజకుమారుణ్ణి చూసి, "రాజకుమారా, కౌరవులు మన అరువేల గోవులను పట్టుకున్నారు. నువ్వు మహావీరుడవని రాజుగారు చెబుతుంటారు. మన గోవులను వచ్చి విడిపించు. కౌరవసేనను చించి చెండాడు," అని అన్నాడు.

ఉత్తరుడు అని ప్రసిద్ధి కెక్కిన భూమింజయుడు ఈ వార్త వినేటప్పుడు స్త్రీలమధ్య కూర్చుని ఉన్నాడు. అందుచేత అతను తాను నిజంగా మహాయోధుడిగానే అనుకుని, "మన ఆవులను అవలీలగా మరల్చ



గలను గాని, నాకు యుద్ధమర్మం తెలిసిన సారథి లేకపోవటం విచారంగా ఉన్నది. మంచి సారథిని చూడండి," అన్నాడు.

ఉత్తరుడి వద్ద ఉన్న స్త్రీలతోబాటు బృహన్నల రూపంలో అర్జునుడు కూడా అక్కడే ఉన్నాడు. అతను తమ అజ్ఞాత వాసం పూర్తి అయినట్టు లెక్క చూసుకుని, రహస్యంగా ద్రౌపదితో, "నేను ఒకప్పుడు అర్జునుడికి సారథిగాఉండి, అతని మెప్పు పొందినవాడినని ఉత్తరుడికి చెప్పి, నన్ను సారథిగా పెట్టుకోమను," అన్నాడు.

ద్రౌపది కొంచెం సిగ్గుపడుతూ ఉత్తరుణ్ణి సమీపించి, అర్జునుడు చెప్పమన్న మాట చెప్పింది. బృహన్నల నపుంసకుడని సందేహిస్తూ, ద్రౌపది గెలుస్తావని గట్టిగా, చెప్పిన మీదట ఉత్తరుడు సరేనన్నాడు.

అతను కోరిన మీదట, అతని చెల్లెలు ఉత్తర బృహన్నలను సమీపించి, తన అన్నకు సారథిగా పనిచెయ్యమని కోరింది.

ఉత్తరుడు కౌరవ యోధులతో యుద్ధం చెయ్యటానికీ,అర్జునుడు అతనికి సారథ్యం చెయ్యటానికీ, సిద్ధమయ్యారు. ఉత్తరా, ఆమెతోటి ఆడపిల్లలూ బృహన్నలతో, "మీరు భీష్మ ద్రోణులను జయించి, మా బొమ్మలకు రంగురంగుల బట్టలు, మెత్తనివి తీసుకురండి," అని కోరారు.

అర్జునుడు నవ్వి, "ఉత్తరుడు గెలిస్తే అలాగే తెస్తాను," అన్నాడు.

రథం నగరం దాటింది. ఉత్తరుడు అర్జునుడితో, "బృహన్నలా, రథాన్ని కౌరవ సేనలుండేదిక్కుగాతోలు, మనం ఆ సేనను జయించి, ఆవులను మళ్ళించుకుని త్వరగా తిరిగిరావాలి," అన్నాడు.

అర్జునుడు రథాన్ని వేగంగా నడిపాడు. వాళ్ళు శ్మశానం మధ్య ఉన్న శమీవృక్షాన్ని చేరేసరికి, దూరాన కౌరవసేన మహా సముద్రంలాగా కనిపించింది. ఆ సేనలు రేపిన దుమ్ము ఆకాశంలోకి చాలా ఎత్తు లేస్తున్నది. ఆ దృశ్యం చూసి ఉత్తరుడు బెదిరి పోయాడు.

"అమ్మో, ఈ సేనను నేనెట్లా గెలుస్తాను? దేవతలు కూడా గెలవలేరు. మా నాన్న సైన్యంతో త్రిగర్తుల మీదికి వెళ్ళటంచేత నేను పురంలో ఒంటిగా దిగబడి పోయాను. నేను భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, ఇంకా అనేక మంది యోధులనూ ఒంటరిగా ఎదిరించ గలనా? బృహన్నలా, రథాన్ని వెనక్కు తిప్పు," అని ఉత్తరుడు విలవిలలాడాడు.

"నాయనా, భయపడకు. నిన్ను చూసి శత్రువులు నవ్వుతారు. వాళ్ళతో యుద్ధం చెయ్యి. గెలిచి వస్తానని ఆడవాళ్ళ ముందు ప్రజ్ఞలు పలికావు. నేను రథాన్ని శత్రువుల మీదికే పోనిస్తాను. ఏ విధంగానైనా సరే వాళ్ళను జయించకుండా తిరిగిపోను," అన్నాడు అర్జునుడు.

"కౌరవులు మా గోవులను ఎత్తుకుపోనీ, మా అంతఃపుర స్త్రీలు నన్నుచూసి నవ్వనీ! నేను మాత్రం యుద్ధం చెయ్యలేను," అంటూ ఉత్తరుడు రథం మీదినుంచి కిందికి దూకి, విల్లూ బాణాలూ పారేసి, నగరం కేసి పరిగెత్తసాగాడు.

"యుద్ధంలో చావనైనా చావాలిగాని, వెన్ను చూపి పారిపోవటమా?" అంటూ అర్జునుడు రథం దిగి, ఉత్తరుడి వెంట పడ్డాడు. అతని బృహన్నల ఆకారంచూసి, అర్జునుడని తెలుసుకోలేక కౌరవ సేనల వాళ్ళు విరగబడి నవ్వారు.

ఈ లోపల అర్జునుడు ఉత్తరుణ్ణిజుట్టు పట్టుకుని ఆపి, తనను పోనివ్వమనిరక రకాలుగా వేడుకుంటున్న ఉత్తరుణ్ణి రథం దగ్గిరికిలాక్కొచ్చి, "నేను యుద్ధంచేసి గోవులను విడిపిస్తాను, నువ్వు రథం నడుపు," అంటూ అతన్ని రథం ఎక్కించాడు.

రథం శమీవృక్షానికి సమీపంగా వచ్చినాక అర్జునుడు ఉత్తరుడితో, "నాయనా, మన వద్ద ఉన్న ఆయుధాలు ఎందుకూ పనికిరావు. నువ్వు ఈ చెట్టు ఎక్కు. దీని మీద పాండవులు తమ ఆయుధాలు దాచారు. అందులో అర్జునుడి గాండీవం కూడా ఉన్నది. పై కప్పు విప్పావంటే



నీకు ఆయుధాలన్నీ కనిపిస్తాయి," అన్నాడు.

ఉత్తరుడు చెట్టు ఎక్కి, అస్త్రాలను విప్పదీసి, వాటిని చూసి ఆశ్చర్యపడుతూ, "మాయజూదంలో రాజ్యం పోగొట్టుకున్న పాండవులూ, ద్రౌపదీ ఏమయ్యారో తెలియదు గదా!" అని విచారంగా అన్నాడు.

"నేనే అర్జునుణ్ణి, మీ తండ్రి కొలువులో ఉండే కంకుడు ధర్మరాజు. మీ వంటల వాడైన వల్లవుడే భీముడు. గుర్రాలను చూసేవాడు నకులుడు. గోవులను పాలించే వాడు సహదేవుడు. కీచకుల చావుకు కారణభూతురాలైన సైరంధ్రి ద్రౌపది," అని అర్జునుడు అన్నాడు.

ఉత్తరుడు మొదట అర్జునుడి మాటలు నమ్మలేకపోయాడు. తనకు ఏమేమి పేర్లు



న్నాయో, అవి ఎలా వచ్చాయో అర్జునుడు వివరించి చెప్పిన మీదట ఉత్తరుడు అతని కాళ్ళమీద పడి, "నీ పరిచయం కలగటం నా మహాభాగ్యం. నేను తెలియక ఏమేమో వాగి ఉంటాను, క్షమించు. నా భయం పోయింది. నువ్వు ఏ సేన కేసి రథం తోలమన్నా తోలుతాను," అన్నాడు.

అర్జునుడు ఉత్తరుడి చేత ఆయుధాలను రథంలో పెట్టించి, "నీ శత్రువులను నేనెలా నాశనం చేస్తానో చూడు," అంటూ గాండీవాన్ని మాత్రం తాను తీసుకున్నాడు. తరవాత తన చేతి కంకణాలు తీసేసి, జుట్టు ముడివేసుకుని, తూర్పుగా తిరిగి అస్త్రాలను ధ్యానించాడు. అతను గాండీవానికి తాడు తగిలించి మీటే సరికి మహా ధ్వని పుట్టింది. అర్జునుడు శంఖం పూరించే సరికి ఉత్తరుడే భయపడ్డాడు. అలాటి నాదం అతను ఎన్నడూ వినలేదు.

అర్జునుడి రథం తమకేసి వస్తుంటే చూసి ద్రోణాచార్యుడు దుర్యోధనుడితో, "ఆ వచ్చేవాడు నిశ్చయంగా అర్జునుడు," అన్నాడు.

ఆ మాట విని దుర్యోధనుడు, "అజ్ఞాత వాస సంవత్సరం పూర్తికాక మునుపే అర్జునుడు బయటపడ్డాడు. తిరిగి పాండవులు పన్నెండేళ్ళు వనవాసం చెయ్యాలి. గడువు తీరలేదని వాళ్ళు ఎరగక పోయి ఉండాలి. లేదా, మనం పొరపాటు పడి ఉండాలి. సరి అయిన లెక్క తేల్చవలిసినవాడు భీష్ముడే. నిన్న సాయంకాలం త్రిగర్తులు దక్షిణాన మత్స్య గోగణాలను పట్టి ఉంటారు. ఇవాళ ఉదయం మనం ఉత్తరాన గోవులను పట్టాం. గోవులను విడిపించటానికి అర్జునుడు వస్తున్నాడు. మత్స్యసేన ఇతని వెనక వస్తున్నదేమో తెలియదు. అర్జునుడితో యుద్ధం చేద్దాం," అన్నాడు

"గడువు తీరకపోతే అర్జునుడు ఇలా బయట పడడు. అతను గోవులను విడిపించుకోకుండా తిరిగిపోడు గనక యుద్ధం తప్పదు," అన్నాడు ద్రోణుడు.

భీష్ముడు దుర్యోధనుడితో, "ప్రతిఅయిదేళ్ళకూ రెండేసి అధికమాసాలు వస్తాయి. పాండవులు వనవాసం కిందా, అజ్ఞాత వాసం కిందా గడిపిన పదమూడేళ్ళలోనూ అయిదు నెలల పన్నెండు రోజులు అధికంగా వచ్చాయి. ఆ లెక్క ప్రకారం పాండవుల అజ్ఞాతవాసం గడువు తీరిపో

యింది. అది తెలిసే అర్జునుడు వస్తు న్నాడు.యుద్ధంలో జయాపజయాలు నిర్ణ యించటం సాధ్యం కాదు. అందుచేత న్యాయంగా పాండవులకు రాజ్యం ఇస్తావో, యుద్ధం చేస్తావో, తేల్చుకో," అన్నాడు.

"నేను పాండవులకు రాజ్యం ఇవ్వను. యుద్ధానికి సిద్ధంకండి," అన్నాడు దుర్యో ధనుడు.

"అలా అయితే, నువ్వు మన సేనలో నాలుగోవంతు వెంట బెట్టుకుని హస్తినా పురానికి బయలుదేరు. మరొక నాలుగో వంతు సేన గోగణాలను వెంటబెట్టుకుని నీ వెనకనే వస్తుంది. మిగిలిన సగం సేనతో నేనూ, ద్రోణుడూ, కర్ణుడూ, అశ్వ త్థామా, కృపుడూ అర్జునుణ్ణి ఎదిరించి యుద్ధం చేస్తాం," అన్నాడు భీష్ముడు.

అందరికీ ఈ పద్ధతి నచ్చింది. దుర్యోధ నుడు కూడా అలా చేయటానికి సమ్మతిం చాడు. భీష్ముడు సేనను వ్యూహపరచి, ఏపక్కన ఏ యోధుడు నిలబడాలో నిర్ణ యించాడు.

వ్యూహంలో నిలబడిన కౌరవసేన కేసి అర్జునుడి రథంవచ్చింది. ఇప్పుడు అర్జు నుడు గుర్తించటానికి వీలుగా కనిపిం చాడు. అతను ఉత్తరుడితో, "బాణం వేటు దూరంలో రథాన్ని నిలుపు. దుర్మార్గుడైన దుర్యోధనుడు ఎక్కడ ఉన్నదీ చూస్తాను. మిగిలిన వాళ్ళను వదిలేసి అతన్ని జయి స్తాను. ఆ తరవాత వీరందరూ ఓడిన వాళ్ళే," అన్నాడు.

అతను ఉత్తరుడికి ద్రోణుణ్ణీ, అశ్వత్థా మనూ, కృపాచార్యుణ్ణీ, కర్ణుణ్ణీ చూపాడు. కాని దుర్యోధనుడు కనిపించలేదు.

"దుర్యోధనుడు ప్రాణాలు దక్కించు కుని, గోవులతోసహా దక్షిణమార్గాన హస్తినా పురానికి బయలుదేరాడల్లే ఉంది. ఉత్త రుడా, రథాన్ని దుర్యోధనుడు వెళ్ళే వైపుగా నడిపించు. అతన్ని ఎదిరించి గోవులను మరలిస్తాను," అన్నాడు అర్జునుడు.

అర్జునుడు తమ నందరినీ విడిచిపెట్టి మరొక దిక్కుగా ఎందుకుపోతున్నాడో గ్రహించి కృపాచార్యుడు, "అర్జునుడు దుర్యోధనుడి మీదికి పోతున్నాడు. అర్జు నుడి ముందు దుర్యోధనుడు నిలవలేడు. అందుచేత మనం దుర్యోధనుడికి అండగా వెళ్ళి నిలబడదాం," అన్నాడు.



# చందమామ కబుర్లు

### ఆలోచించే రోబో!

సుప్రసిద్ధ జపాన్‌సంస్థ హొండా ఇప్పుడు పి-2 అనే హ్యూమనాయిడ్ రోబోను రూపొందించింది. 6 అడుగుల ఎత్తూ; 210 కి.గ్రా. బరువూ గల ఈ రోబో – వ్యోమగామిఉడుపులు ధరించిన మనిషిలా కనిపిస్తుంది. ఇది చదునుగా ఉన్న నేల మీద



ముందుకూ, వెనక్కూ నడవగలదు; మెట్లెక్క గలదు. పడదోయాలంటే, ఎదుర్కొని నిలదొక్కుకోగలదు. అవసరమైతే అది రెండు చేతులు కూడా ఉపయోగించగలదు. టోక్యో విశ్వవిద్యాలయం, రోబోటిక్స్ విభాగానికి చెందిన ప్రొఫెసర్ సుసుమూ, టోచీ దీనిని సృష్టించారు.

### అరుదైన జ్ఞాపకశక్తి

కేరళ రాష్ట్రం మంజేరిలో నూఫిల్ అనే కుర్రాడు రెండవతరగతి చదువుతున్నాడు. వాడు నెల, తారీఖు చెబితే చాలు, అది ఫలానా వారం అని తడుముకోకుండా చెప్పేస్తాడు. 1997వ సం॥లోని 364 రోజులను క్షణాలలో చెప్పగలడు. ఇంతకూ ఆ కుర్రాడు లెక్కలలో గట్టివాడా అంటే అదేం కాదు. చదువులోనూ సగటు



కన్నాతక్కువస్థాయివాడే. అయితే, వాడి క్యాలండర్ పరిజ్ఞానం మాత్రం ఆశ్చర్యం కలిగించేదిగా ఉంది. ఇంటా, బయటా, ఊళ్ళో, రాష్ట్రంలో, దేశంలో జరిగిన ముఖ్యమైన సంఘటనల తారీఖులను మాత్రం సరిగ్గా చెప్పగలుగుతున్నాడు. వాడి జ్ఞాపకశక్తి చాలా అరుదైనది!

### న్యూజియం!

అమెరికాలోని ఆర్లింగ్టన్‌లో ఇటీవల పిల్లలకోసం ఒక న్యూస్ మ్యూజియంను రూపొందించారు. ఈ మ్యూజియంలోకి ప్రవేశిస్తే ఒక పత్రికాకార్యాలయంలో అడుగుపెట్టిన అనుభూతి కలుగుతుంది. అంతేకాదు. అప్పటికప్పుడు రిపోర్టర్‌గానో, ఎడిటర్‌గానో పనిచేయవచ్చు. అక్కడ అమర్చిన కంప్యూటర్ల సహాయంతో పత్రికను ప్రచురించవచ్చు. ప్రపంచం నలుమూలల నుంచి వచ్చే వార్తలనుంచి అవసరమైన వాటిని ఎంపిక చేసి ఒక ఎడిటర్ అనుభూతిని పొందవచ్చు. ఈభవనంలో మరొక విభాగంలో టీవీ అనౌన్సర్‌గా, వ్యాఖ్యాతగా, కావాలంటే ప్రముఖ పత్రికా సంపాదకులతో ముఖాముఖి కార్యక్రమాలలో పాల్గొనవచ్చు. ఇక్కడ ప్రపంచంలో జరిగే వార్తలను అప్పటికప్పుడు తెలియజేసే పెద్ద గ్లోబు వుంది. పుట్టినరోజూ, తేదీని పంపితే, పక్కనున్న టీవీ తెరమీద మనంకోరే ఆనాటి వార్తాపత్రిక మొదటి పేజీ కనిపిస్తుంది!




# లేపాక్షి దేవాలయం



విజయనగరం రాజులు దక్షిణ భారతదేశంలో అద్భుతమైన శిల్పకళా వైభవంతో విరాజిల్లే అనేక దేవాలయాలను నిర్మించారు. అటువంటి దేవాలయాలలో హిందుపురానికి పదమూడు కి.మీ. దూరంలో ఉన్న లేపాక్షి దేవాలయం ఒకటి. ఇది 1538వ సం॥లో నిర్మించబడింది. విజయనగరం రాజుల కాలంనాటి శిల్పకళకు ఇదొక చక్కని ఉదాహరణ. 'లేపాక్షి' ఒక ప్రత్యేక శిల్పకళా సంప్రదాయం. ఈఆలయానికి సంబంధించిన కథలు చాలా ప్రచారంలో ఉన్నాయి. ఈ ఆలయం ఒక చిన్న కొండమీద నిర్మించబడి ఉన్నది. పడమటి దిశలో రకరకాల దేవతా శిల్పాలు మలచబడిన స్తంభాలు గల విశాల మంటపం ఉన్నది. మంటపం కప్పుకు కింది భాగంలో ప్రకాశవంతమైన ఎరుపు, పసుపు, ఆకుపచ్చ రంగులలో అనేక చిత్రాలు చిత్రించబడి ఉన్నాయి. ఒకే శిలలో మలచిన ఏడు పడగల సర్పం ఇక్కడి ప్రత్యేక ఆకర్షణ. నల్లరాతితో చెక్కిన పెద్ద శివలింగం ఒకటి ఆలయ ప్రాంగణంలో ఉన్నది. ఆలయానికి అర కి.మీ. దూరంలో సుప్రసిద్ధమైన 'లేపాక్షి నంది' విగ్రహం ఉన్నది. ఒకే ఎర్ర శిలలో చెక్కబడిన బ్రహ్మాండమైన విగ్రహం ఇది. దీనిని మన దేశంలోని అతిపెద్ద నంది విగ్రహంగా చెబుతారు. మన శిల్పుల శిల్పకళా నైపుణ్యాన్ని చాటే అద్భుతమైన కళాఖండం ఇది!



పురాణకాలంనాటి రాజులు :

# కౌశికుడు

కౌశికుడు ప్రజారంజకంగా పాలన సాగించిన ధర్మప్రభువు. ఆయన ప్రజల పట్ల అపార కరుణ చూపేవాడు. ప్రజలకు ఆయనపట్ల గౌరవాదరాలు ఉండేవి. రాజ్యవ్యవహారాలు చూసుకుని, రాత్రి పడక చేరగానే ఆయన ముఖం వెలవెల బోయేది. తన విధిని తలుచుకుని ఆయన బాధపడేవాడు. కారణం – అర్ధరాత్రి సమయంలో తన భార్య కళ్ళెదుటే ఆయన కోడిపుంజుగా మారిపోయేవాడు!

తెల్లవారకముందే ఆయనకు యధాప్రకారం మునుపటి రూపం వచ్చేసేది. కాబట్టి, ఈ విషయం రాణికి తప్ప మరెవ్వరికీ తెలియదు. ఇలా కొంతకాలం గడిచింది.

ఒకనాడు గాలవుడనే ముని రాజదంపతులను చూడడానికి వచ్చాడు. రాణి ఆయనకు అతిథి మర్యాదలు చేసి, రాజుగారి విచిత్ర దుస్థితిని గురించి తెలియజేసి, పరిష్కారం ప్రార్థించింది. ముని కళ్ళుమూసుకుని కొంతసేపు ధ్యానంలో గడిపి, ఆ తరవాత, "పూర్వజన్మలో రాజుకు కోడిమాంసం అంటే విపరీతమైన మక్కువ. తాను భుజించేది ఒకటి రెండే అయినప్పటికీ రోజూ అసంఖ్యాకంగా కోడిపుంజులను చంపేవాడు. వాటిలో మంచివాటిని ఏరుకునేవాడు. అతని పేరాశకూ, క్రూరప్రవృత్తికీ ఆగ్రహంచెందిన తామ్రచూడుడనే కోడిపుంజుల నాయకుడు 'వచ్చే జన్మలో రాత్రులలో కోడిపుంజువై పోదువు గాక!' అని శపించాడు. ఆ శాపకారణంగానే రాజుకీ విచిత్ర పరిస్థితి ఏర్పడింది. సర్వపాపహారి అయిన పరమశివుణ్ణి ప్రార్థించినట్టయితే శాపవిముక్తి పొందగలడు!" అని సెలవిచ్చాడు.

రాజు ఒక గుహను చేరి శివుణ్ణి గురించి కఠోర తపస్సు చేశాడు. పరమశివుడు తపస్సుకు మెచ్చి శాపవిముక్తి కలిగించాడు. సంతోషంగా తిరిగి వచ్చిన రాజుకు రాత్రులలో కోడిపుంజుగా మారే దుస్థితి తప్పింది. ఆ తరవాత ఆయన దైవభక్తినీ, జీవకారుణ్యాన్నీ ప్రచారం చేశాడు!



## మీకు తెలుసా?

### అతిప్రాచీనమైన నిఘంటువు






ఇవాళ వివిధ భాషలలో, విభిన్న పరిమాణాలలో నిఘంటువులు ఉన్నాయి. అవి పదాలకు అర్థాలు, వాటి ఉచ్చారణ, ఉపయోగం తెలియజేస్తాయి. మొట్టమొదటి ఇంగ్లీష్ డిక్షనరీని (నిఘంటువు) 1775వ సం॥లో డా॥శామ్యూల్ జాన్సన్ సంకలనం చేశాడు. దానిని 'ఇంగ్లీషు భాషా నిఘంటువు' అన్నారు. అయినా, అతిప్రాచీనమైన నిఘంటువును గురించి తెలుసుకోవాలంటే మనం క్రీ.శ. 4వ శతాబ్దం వరకు వెళ్ళాలి. పర్షియన్ భాషలో 5000 పదాలతో ఈ నిఘంటువు బద్రుద్దీన్ ఇబ్రహీం అనే ఒక భారతీయ పాలకుడి పోషణలో రూపొందించబడింది. వైద్యం, భూగోళం, వ్యవసాయం, జంతుజాలం, పువ్వులు మొదలైన విభాగాలకు చెందిన పదాలు ఇందులో చోటుచేసుకున్నాయి.

దీనికన్నా ప్రాచీనమైన నిఘంటువులు 13వ శతాబ్దంలో బాగ్దాద్‌లోని ఒక గ్రంథాలయంలో ఉండేవి. అయితే మంగోల్ చక్రవర్తి చెంఘిజ్ ఖాన్ ఆ గ్రంథాలయాన్ని తగులబెట్టాడు. ఆ గ్రంథాలయం మూడు రోజుల పాటు మండింది. విలువైన వ్రాతప్రతులన్నీ బూడిదైపోయాయి!

## ఇంద్రధనుస్సు

### రెగ్గీ





రెగ్గీ సామాన్య ప్రజలకు ప్రియమైన సంగీతం. 1960లలో అది జెమైకాలో ఆరంభమై వెస్ట్ ఇండియన్లు నివసించే ప్రాంతాలలో వేగంగా వ్యాపించింది. ప్రతి 'బార్'లో రెండవ, నాల్గవ 'కౌంట్లలో' హెవీ బీట్‌తో, రెగ్గీకి ప్రత్యేకమైన విధం వుంటుంది. రెగ్గీ గీతాలు జమైకా భాషలో కరీబియన్ జీవన సంస్కృతులను తెలియజేసేవిగా ఉంటాయి. కొన్ని రెగ్గీ రికార్డులు గాత్రం లేకుండా కేవలం బ్యాకింగ్ ట్రాక్‌గా ఉంటాయి. వీటిని 'డబ్' రెగ్గీ అంటారు. రెగ్గీ డిస్కోలలో, డిస్క్ జాకీలు డబ్ రెగ్గీని వాయించి, ఆ తరవాత వేగంగా పదాలు చేర్చుకుంటూ పాడతారు. కీ॥శే॥ బాబ్ మార్లీ గాయక బృందం రెగ్గీకి ప్రపంచ వ్యాప్తంగా ప్రాచుర్యం కలిగించారు.

స్వాతంత్ర్య స్వర్ణోత్సవ సంవత్సర చందమామ కానుక!

# ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం



[వ్యాపారం కోసం భారతదేశానికి వచ్చిన ఈస్ట్ ఇండియా కంపెనీ స్థానిక రాజుల అనుమతి పొంది కోటలు నిర్మించింది. కుయుక్తులతో స్థానికులనుంచి చిన్న చిన్న ప్రాంతాలను ఆక్రమించుకోసాగింది. దత్తత తీసుకోవడం చెల్లదనీ, పేష్వాబాజీరావు దత్తపుత్రుడు కాబట్టి నానాసాహెబ్‌ను ఆయన వారసుడుగా అంగీకరించనన్నది. ఝాన్సీరాజు సంతానం లేకుండా మరణించడంతో, ఆ రాజ్యం తమకే చెందుతుందని కంపెనీ ప్రకటించింది. ఆ చర్యకు రాణి ఝాన్సీ లక్ష్మీబాయి ఆగ్రహం చెందింది. కంపెనీ వ్యవహారాలపట్ల ప్రజలలో రోజురోజుకూ నిరసన, వ్యతిరేకత ఎక్కువ కాసాగాయి. —తరవాత]

అదొక వెన్నెల రాత్రి. మెరిసే దుస్తులూ, రత్నాలు పొదిగిన తలపాగా ధరించిన చురుకైన ఒక యువకుడు గుర్రంపై మీరట్ పొలిమేరలోని గంగా తీరానికి వచ్చాడు. ఒక మర్రి వృక్షాన్ని సమీపించగానే గుర్రంపై నుంచి కిందికి ఉరికాడు.

అతడు అక్కడికి రాగానే చుట్టు పక్కల పొదలమాటునుంచి దాదాపు పాతిక మంది సిపాయిలు బిల బిలా అతని ఎదుటికి వచ్చి చేతులుజోడించారు. వాళ్ళల్లో ఒకడు, "పేష్వాకు స్వాగతం! పేష్వా నానా సాహెబ్‌కు స్వాగతం!" అన్నాడు.

"సోదరులారా! మీ అభిమానానికి చాలా సంతోషం. మీరు నిజంగానే నన్ను అభిమానించేపక్షంలో ఇప్పటిమీయజమానులను వదిలిపెట్టాలి. వట్టి మాటల మీద, శుష్క గౌరవాలమీద నాకు నమ్మకం లేదు!" అన్నాడు నానాసాహెబ్ గంభీరస్వరంతో.

"తెల్లవాళ్ళను మా యజమానులుగా భావించడం లేదు. మీరే మాకు యజమా

నులు. మీ ఆజ్ఞను శిరసావహించడానికి సిద్ధంగా ఉన్నాము," అన్నాడు ఒక సిపాయి.

"ప్రభూ! ప్రతిరోజూ మేము అవమానాల పాలవుతున్నాము. మన దేవుళ్ళను వాళ్ళు అపహసిస్తున్నారు. ముస్లిం సోదరుల విశ్వాసాలను కూడా వాళ్ళు హేళన చేస్తున్నారు. ఒకనాడు మామిత్రుడొకడు తెగించి వాళ్ళ పూజారితో –అన్నిమతాలనూ మేము గౌరవిస్తాము. మీ దేవుళ్ళను మేమెవ్వరంకించ పరచడంలేదుకదా! మమ్మల్ని మా మానాన ఎందుకు బతకనివ్వరు? అన్నాడు. అంతే! ప్రత్యుత్తరం మాటలతోరాలేదు. కొరడాతో స్పృహకోల్పోయేంతవరకుకొట్టారు.ఒళ్ళంతా నెత్తురు గాయాలతో నిండిపోయింది!" అన్నాడు మరొక సిపాయి.

"పొట్ట కూటికోసం మేము సైన్యంలో చేరాం. మాలో కొందరు స్వంత శక్తి సామర్థ్యాలతో సైన్యంలో చిన్న చిన్న అధికారులయ్యారు. అయితే అలాంటి వారికి,వాళ్ళకు సమానమైన పదవుల్లో వుండే తెల్లవారికిచ్చే జీతాలలో నాలుగోవంతు కూడా ఇవ్వడం లేదు. ఇదెక్కడిన్యాయం? ఇలాంటి అన్యాయాలను ఇంకా ఎంతకాలంభరించాలి?" అన్నాడు ఇంకొక సిపాయి ఆవేశంతో.

"ఇప్పుడు మరొక సంకట పరిస్థితి ఏర్పడింది. కొత్త తుపాకీలను ఉపయోగించాలని కంపెనీ నిర్బంధిస్తున్నది. ఈ తుపాకీలలో ఉపయోగించే తూటాలకు ఆవుకొవ్వు, పందికొవ్వు పూశారు. వాటిని ఉపయోగించే ముందు, ఆ కొవ్వును మా పళ్ళతో కొరకాలి. అలా కొరకడంతో హిందువులూ, ముస్లింలూ తమ మతాలను కోల్పోతారు," అన్నాడు నాలుగవ సిపాయి ఎంతో బాధగా.

"మంగల్‌పాండే ఆత్మ నన్ను ప్రతి రాత్రీ వెంటాడి వేధిస్తున్నది. మంగల్‌పాండే





చాలా ధైర్యవంతుడు, ఉత్తముడు.కాని తొందరపాటు స్వభావంకలవాడు, తెల్ల వాళ్ళ నుంచి మాతృభూమికి ఎప్పుడు విముక్తి కలిగిస్తారు? ఇంకా ఎంతకాలం ఈ గాఢ నిద్ర?, అని నన్ను వేధిస్తూనే ఉన్నాడు," అన్నాడు వేరొక సిపాయి.

మంగల్‌పాండే గురించి నానా సాహెబ్‌కు బాగా తెలుసు. బారక్‌పూర్‌లోని మంగల్ పాండే అచంచలమైన ధైర్య సాహసాలు కలవాడు. అతడున్న శిబిరంలో కూడా కొవ్వు పూసిన తూటాలను వాడవలసిన నిర్బంధంఏర్పడింది. ఆ రకం తుపాకీలు వద్దని సిపాయిలు ఆంగ్లేయ అధికారులవద్ద మొరపెట్టుకున్నారు. కాని వాళ్ళు దానిని వినిపించుకోలేదు. తమ పరిస్థితికి ఎంతో బాధపడిన మంగల్‌పాండే ఒక రాత్రంతా నిద్రలేకుండా అలమటించి, హఠాత్తుగా గది నుంచి వెలుపలికి వచ్చి, "తిరగబడదాం రండి!" అని కేకపెట్టాడు. ఆకేకఏమిటో గ్రహించి, సిపాయిలు వెలుపలికి వచ్చేలోగా సార్జంట్ మేజర్‌హఘ్సన్ మంగల్‌పాండేను పట్టుకోబోయాడు. కాని మంగల్ పాండే అతన్ని కాల్చి చంపాడు. అంతలో అక్కడికివచ్చిన మరొక అధికారి మంగల్‌పాండేను కత్తితో పొడిచాడు. ఆ తరవాత అతన్ని ఉరితీశారు!

నానాసాహెబ్ అందరి మాటలూ విని కొంతసేపు మౌనం వహించి, ఆ తరవాత, "సోదరులారా! మంగల్‌పాండేకు నా నమోవాకాలర్పిస్తున్నాను. ఆయన ధైర్యసాహసాలు, త్యాగం మనకు స్ఫూర్తినివ్వాలి. అయితే మనం అతని లాగా తొందరపడకూడదు. తొందరపాటు వల్ల మరి కొందరు ప్రాణత్యాగం చేయగలమే తప్ప మరే ప్రయోజనమూ ఉండదు. మనకు తెల్లవాళ్ళపీడ విరగడ కావాలి. అదే మన లక్ష్యం.మనమందరం కలిసికట్టుగాఇక్కడ, అక్కడ, ప్రతిచోటా ఒక్కరోజునే విజృంభించామంటే మన లక్ష్యాన్ని సాధించవచ్చు. అర్థమయిందా?" అన్నాడు.

"అర్థమయింది!" అన్నారు అందరూ ఒక్కసారిగా.

"మంచిది. తిరుగుబాటు జరపవలసిన రోజు నిర్ణయమయింది.తగినసమయంలో దానిని మీకు తెలియజేస్తాము, అంతవరకు ఓపికపట్టండి!" అన్నాడు నానాసాహెబ్.

"అంతవరకు కాలం వృథా చేయవలసిందేనా?" అన్నాడు ఒక సిపాయి.

"వృథా చేయనవసరం లేదు. సద్విని యోగం చేసుకోవాలి. మీలో ప్రతిఒక్కరూ ఈవిషయంలో ఇంకా అటూఇటూ తేల్చుకో లేకుండా సంధిగ్ధంలో వున్న సిపాయిలను కలుసుకుని, వారికి విషయాలను విడమ రిచి చెప్పి వాళ్ళను మనవైపు తిప్పుకోవాలి. సమయం ఆసన్నమయినప్పుడు ఎలా తిరగబడాలో రహస్యంగా పథకాలు ఆలో చించాలి!" అన్నాడు నానాసాహెబ్.

"నానా సాహెబ్ వర్ధిల్లాలి!" అంటూ కొందరు నినాదాలు చేశారు.

"ఆపండి!" అని చేయెత్తిన నానాసాహెబ్, "శత్రువులను మనం తక్కువగా అంచనా వేయకూడదు. దూరతీరాలనుంచి వచ్చి మన భూభాగాలను ఆక్రమించుకోవడం లోనే తెల్లవాళ్ళ తెలివితేటలు ఋజువవు తున్నాయి. వాళ్ళగూఢచారులు మన కార్య కలాపాలను పసిగట్టే అపాయం ఉన్నది. జాగ్రత్తగా వ్యవహరించాలి. అది చాలా ముఖ్యం!" అని హెచ్చరించాడు.

సిపాయిలు తలలువంచినానాసాహెబ్‌కు నమస్కరించి మౌనంగా వెళ్ళిపోయారు.

నానాసాహెబ్ వివిధ ప్రాంతాలను రహ స్యంగా పర్యటించాడు. రాజులనూ, సామం తులనూ, సంస్థానాధీశులనూ కలుసు కుని జరుపనున్న తిరుగుబాటుకు మద్దతు కోరాడు. తానుస్వయంగా వెళ్ళలేని ప్రాంతా లకు తన సేనానాయకుడు తాంతియా తోపేనీ, మంత్రి అజిముల్లా ఖాన్‌నూ పంపాడు. అతని తమ్ముడు బాలాసాహెబ్ అతని వెంట వుంటూ కంటిని రెప్పలా కాపాడుతూ వచ్చాడు.



ఒకనాడు అన్నదమ్ములిద్దరూ బిత్తూరు లోని తమ రాజభవనాన్ని సమీపిస్తూం డగా, "అన్నయ్యా, తమరు చాలా అలిసి పోయారు. మీకు విశ్రాంతి కావాలి!" అన్నాడు బాలాసాహెబ్.

"నిజమే. వెళ్ళి విశ్రాంతి తీసుకుం టాను," అన్నాడు నానాసాహెబ్.

అంతలో ఒక అధికారి ఎదురువచ్చి, "ప్రభూ! ఝాన్సీరాణి లక్ష్మీబాయివచ్చారు," అన్నాడు.

నానాసాహెబ్ విశ్రాంతి మాట మరిచి పోయి, పట్టరాని ఆనందంతో భవనంలోకి అడుగుపెట్టాడు. రాణి లక్ష్మీబాయి అమిత సంతోషంతో ఎదురువచ్చి నానాసాహెబ్ పాదాలకు నమస్కరించబోయింది. నానా సాహెబ్ ఆమెను వారిస్తూ, "ఇది కలా?

నిజమా! నువ్వేలా ఇక్కడికి వచ్చావు?" అన్నాడు నవ్వుతూ.

"నీ ప్రశ్నకు సమాధానంవేనవేల సంవత్సరాలకు పూర్వమే సతీదేవి చెప్పింది, అన్నయ్యా! తన తండ్రి యజ్ఞం చేస్తున్నాడనితెలియగానే అక్కడికి వెళ్ళాలని ఉత్సాహపడింది సతీదేవి. పిలవని పేరంటానికి ఎందుకు? అన్నాడు పరమశివుడు. అందుకు సతీదేవి చెప్పినసమాధానం ఏమిటో తెలుసా?" అని అడిగింది లక్ష్మీబాయి.

"తెలియదు!" అన్నాడు నానాసాహెబ్.

"తండ్రి ఇంటికి వెళ్ళడానికి కుమార్తెకు పిలుపు అవసరంలేదు అన్నది సతీదేవి! నా వరకు తండ్రి ఇంటికీ, అన్నయ్య ఇంటికీ భేదం లేదు!" అన్నది లక్ష్మీబాయి నవ్వుతూ.

"సోదరీ! ఈఅన్నయ్యఇల్లేకాదు; సర్వసంపదలూనీవిగానే భావిస్తున్నాను.అయినా ఇంతదూరం శ్రమపడి ఎందుకు వచ్చావు. ఒక్కమాట చెప్పి పంపితే నేనే అక్కడికి వచ్చేవాణ్ణి కదా!" అన్నాడు నానాసాహెబ్.

"మా అన్నయ్యను చూడడమే శ్రమగా భావిస్తే, ఇక దుర్మార్గులైన ఆ తెల్లవాళ్ళను ఎలా ఎదుర్కోగలను చెప్పు? నువ్వే స్వయంగా కత్తిసాము, ధనుర్విద్య నేర్పిన నీచెల్లెలు అంతటి సుకుమారి అని భావిస్తున్నావా?" అంటూ లక్ష్మీబాయి వెనక్కు తిరిగి చూసింది.

ఉరుకులతో పరుగులతో అక్కడికి వచ్చిన ఒక దూత, "మీరట్‌లోతిరుగుబాటు ఆరంభమయింది!" అన్నాడు.

"అప్పుడేనా?" అన్నాడు నానాసాహెబ్ ఆశ్చర్యంగా.

"కొవ్వు పూసిన తూటాలను ఉపయోగించమని కంపెనీ నిర్బంధించింది. సిపాయిలు తిరస్కరించారు. శిబిరంలోనిసిపాయిలందరి చేతులకూ సంకెళ్ళు తగిలించి ఖైదుచేశారు. పదేళ్ళు కఠిన కారాగార శిక్ష విధించారు!" అన్నాడు దూత.

"తరవాత?"అని అడిగాడు నానాసాహెబ్.

"మరుసటి రాత్రి మిగిలిన సిపాయిలు తిరుగుబాటు చేశారు. వాళ్ళు బందీలుగా వున్న సిపాయిలను విడిపించారు. తెల్లవాళ్ళఇళ్ళను తగలబెట్టారు. నగరం రగులుతున్నది!" అన్నాడు దూత. - (ఇంకావుంది)





# ఏది పుణ్యం?

సాయంత్రంవేళ వంటపని ముగించి, ఇంటిముందు పూలమొక్కల మధ్య కూర్చుని, మల్లెపూలమాల కడుతున్నది కమల. ఇంతలో ఇంటిముందు గుర్రబ్బండి ఆగింది.

మెరిసిపోతున్న పట్టుచీరతో, మెడనిండా నగలతో బండి దిగిన విమలను చూసి ఆశ్చర్యపోయింది కమల.

కమలా, విమలా తోడికోడళ్ళు. అత్తమామలు పోగానే అన్నదమ్ముల మధ్య తంపులుపెట్టి, ఏడాది తిరక్కుండా అన్నదమ్ములు వేరుపడేలా చేశారు వాళ్ళు. విమలభర్త వ్యాపారంలో సాధ్యమైనన్ని అడ్డదారులు తొక్కి, నాలుగేళ్ళు తిరిగేసరికి ఊళ్ళోని పెద్ద ధనికుల్లో ఒకడై పోయాడు. మంచితనాన్నీ, నిజాయితీనీ వదులుకోలేకో, లేక వదులుకోవడం చేతకాకో - కమలభర్త మాత్రం, అటు వ్యవసాయంలోనూ, ఇటువ్యాపారంలోకూడా అంతంత మాత్రంగా వుండిపోయాడు.

తమ దశ తిరిగిన దగ్గరనుంచీ విమల, కమల ఇంటికి రాకపోకలు తగ్గించింది. అటువంటి విమల హఠాత్తుగా రావడం చూసి కమల ఆశ్చర్యపోతూ, "రా, అక్కా! నిన్ను చూసి చాలా రోజులైంది," అంటూ ఎదురువెళ్ళింది.

విమల పూల మొక్కలకేసీ, ఇంటి వాకిటికేసీ ఒకసారి పరీక్షగా చూసి, "అంతా బావున్నారా? కొత్తగా మరమ్మతులూ అవీ చేయించి, అమ్మవారి గుడిని చూడ ముచ్చటగా తయారు చేశారు. గుడికి వెళుతూ, నువ్వు కూడా వస్తావేమో అని బండిని ఇటుకేసి తిప్పించాను," అన్నది.

"తప్పకుండా వస్తాను," అంటూ కమల ఇంట్లోకి వెళ్ళి, నాలుగైదు నిమిషాల్లో తిరిగివచ్చింది.

మాచిరాజు కామేశ్వరరావు



ఇద్దరూ కలిసి బండి ఎక్కారు. వాళ్ళు ఊరు చివర వున్న అమ్మవారి గుడిని చేరేసరికి చీకటి పడుతున్నది. రంగు రంగుల దీపాలతో అందంగా అలంకరింప బడి వున్నది గుడి.

విమలను చూస్తూనే, ధర్మకర్తస్వయంగా వచ్చి వాళ్ళను లోపలికి తీసుకువెళ్ళాడు. గుడి మొదట్లోనే పాలరాయి గోడమీద విమలపేరు అందంగా తాపడం చేసి వున్నది. విమల తన పేరును కమలకు చూపుతూ, "అమ్మవారికి అరవైవేలు పెట్టి వడ్డాణం చేయించాను. అందుకే గోడమీద అలా ప్రత్యేకంగా పేరు చెక్కారు," అన్నది దర్పంగా.

దానితో కమలకు, తన తోడికోడలు పనిగట్టుకుని, తనను గుడికి ఎందుకు తీసుకు వచ్చిందో అర్థమైపోయింది. గర్భ గుడిలోకి పోతూండగా విమల, "మనం ఈరోజుంటాం, రేపు పోతాం. ఇలాంటి పుణ్యకార్యాలు చేస్తేనే, మన పేరు శాశ్వతంగా వుండిపోతుంది!" అన్నది కమలతో.

అప్పుడు ధర్మకర్త కల్పించుకుని, "మీతోడికోడలుగారు అమ్మవారికి వంకీలు, మురుగులు చేయిస్తే బావుంటుంది.మహా అయితే యాభైవేలు కావచ్చు. మీ పేరు పక్కనే, ఆమె పేరుకూడా చెక్కిస్తాం," అన్నాడు.

ఆ మాటలు విని కమల ఆలోచనలో పడింది. మరొక మాసంలో పంట డబ్బు పాతికవేలు చేతికందుతుంది. భర్తను ఎలాగైనా ఒప్పించి, విమల పేరు పక్కనే తనపేరు కూడా వుండేలా చూడాలి!

ఆమె, ధర్మకర్తతో, "అంతఖర్చు పెట్ట లేను. పాతికవేలు పెట్టి అమ్మవారికి మెడలోహారం చేయిస్తాను," అన్నది.

వెంటనే విమల, "మా చెల్లెలి పేరు, నా పేరు కింద అందరికీ కనబడేలాచక్కగా చెక్కించాలి సుమా!" అన్నది ధర్మకర్తతో. తనపేరుకింద అన్న మాటలను కాస్తఒత్తి పలుకుతూ.

తర్వాత ఆమె కమలను వాళ్ళ ఇంటి దగ్గర దించి, మంచినీళ్ళయినాతాగకుండా వెళ్ళిపోయింది.

కొద్దిరోజులు గడిచాక, పంట అమ్మిన డబ్బుపాతికవేలు చేతికి అందిన మర్నాడే, ఊరినుంచికమలపినమామగారువచ్చాడు.

భర్తే ఆయనను రమ్మన్నాడని తెలుసు కున్న కమల, "ఇప్పుడు మీ బాబాయిని

ఎందుకు రమ్మన్నారు? అసలే ఆయన ఆరోగ్యం అంతంతమాత్రం!" అన్నది.

"బాబాయికి గుండెజబ్బు మళ్ళీ తిరగ బెట్టిందట! ఎంత ఖర్చయినా మంచివైద్యం చేయించాలి. ఆయన లేకపోతే ఆ కుటుంబం వీధినపడుతుంది. ముగ్గురాడ పిల్లల తండ్రి. పెద్దమ్మాయి పెళ్ళికుదిరే ట్టుంది– పదివేలకట్నం ఇచ్చుకోగలిగితే! అందుకే, ఈసారి పంటడబ్బు బాబాయి వైద్యానికీ, అమ్మాయిపెళ్ళికీ సర్దుతాన న్నాను. డబ్బు వాయిదాలలో తీరుస్తా నన్నాడుగానీ, అది సాధ్యం కాకపోవచ్చు," అంటూతనబాబాయి వచ్చినపని భార్యకు వివరించాడు కమలభర్త.

ఇది వింటూనే కమల చిరాగ్గా, "ఇంకా నయం! ఉత్తపుణ్యానికి పాతికవేలు ఎలా వదులుకుంటాం? అయినా ఈసారి ఆ డబ్బు నాకు కావాలి," అన్నది.

"ఇప్పుడు పాతికవేలతో నీకేం పని?" అంటూ విస్తుపోయాడు కమలభర్త.

"అమ్మవారికి హారం చేయిస్తాననిమాట యిచ్చాను. గుడి గోడమీద విమల అక్క పేరు పక్కన, నా పేరు కూడా చెక్కిస్తారు," అంటూ సంగతంతా భర్తకు చెప్పింది.

"ఇప్పుడు అమ్మవారిమెడలో హారం లేకపోతే కొంపేంమునిగిపోదు. ముందు బాబాయి పెద్దకూతురు మెడలోకి మంగళ సూత్రంకావాలి! పేర్లు గోడలమీదా, బండల మీదా కాదు చెక్కించుకోవాల్సింది, తోటి మనుషుల గుండెల్లో. ఈ సహాయంచేస్తే, ఆ ఇంటిల్లిపాదీ రోజూ నీ పేరు చెప్పుకుని ఇంట్లో దీపం వెలిగించు కుంటారు,"



అనిఎన్నోవిధాలుగానచ్చజెప్పాలనిచూశాడు కమలభర్త.

"మీరు వెయ్యి చెప్పండి, లక్షచెప్పండి –నేను వినేదిలేదు! గుడికి విరాళం ఇస్తే పుణ్యంకాదని, ఎవరుమాత్రం అంటారు?" అన్నది కమల కోపంగా.

ఈ సంభాషణ జరిగాక వీధి గదిలోకి వెళ్ళిన కమలభర్తకు, వాళ్ళబాబాయి కని పించలేదు. "మన మాటలు విని, మనసు కష్టపెట్టుకుని బాబాయి వెళ్ళిపోయినట్టుంది!" అన్నాడు కమలభర్త బాధగా.

"ఇప్పుడు మనకొచ్చిన కష్టం, నష్టం ఏమీ లేదు. ఈ సాయంత్రమే డబ్బు గుడిలో యిచ్చి వస్తాను," అన్నది కమల.

ఆ సాయంత్రం పాతికవేలు సంచీలో పెట్టుకుని, గుడికి వెళ్ళింది కమల. ధర్మ



కర్త ఏదో పనిమీద ఊళ్ళోకి వెళ్ళాడనీ, కొద్దిసేపట్లో తిరిగి వస్తాడనీ, ఆమెకుగుడి పూజారి చెప్పాడు.

కమల అమ్మవారి దర్శనం చేసుకుని, గుడివెనక వైపుకు వెళ్ళింది. అ సరికి చీకటి పడుతున్నది. ఒక పెడగా గన్నేరు చెట్టుకింద ఎవరో సాధువు ధ్యానంలో వున్నాడు. మరొకపక్క ఒక అరుగు మీద, ఒక ముసలి ముత్తయిదువు కూర్చుని వున్నది.

ఆమె కమలను చూస్తూనే దగ్గరకు పిలిచి, "నాకొక సహాయం చెయ్యి, తల్లీ! ఈ బుట్టలోవున్న పులిహొర, లడ్లు పంచి పెట్టాలి. చూస్తున్నావుగా, నా నడుం వంగి పోయింది, ఓపికలేదు," అన్నది చిన్నగా నవ్వుతూ.

"భోగం చేయిస్తున్నారా? పూజారికి చెబితే, మీ పేరు గోడకు తాపడం చేసిన నల్లబల్లమీద రాస్తాడు. పేరు చెప్పండి!" అన్నది కమల

ఆ మాటలకు ముసలావిడ పెద్దగా నవ్వి, "నలుగురికీ ఉపయోగపడే పని చేయడం ముఖ్యంగానీ, నల్లబల్లమీద పేరెందుకమ్మా? ఎవరన్నా అడిగితే, దుర్గమ్మ పంచమన్నదని చెప్పు, చాలు. మనం ఏపనైనా మన తృప్తికోసం చేయాలి గానీ, పేరుకోసం కాదు," అన్నది.

ఆమాటలు చురకల్లా తగిలిన కమల, "గుడిలో వున్న భక్తులందరికీ పంచమంటారా?" అని అడిగింది.

"ముందు గుడిబయట ఆకలితో అలమటిస్తున్న బిచ్చగాళ్ళకు పంచు. ఆ పైన మిగిలితేనే గుడిలోపలి భక్తులకు! మనం చేయగలిగిన తృణమో ఫణమో సాయం, ముందుగా అవసరంలో వున్న వాళ్ళకందితేనే ఫలం, కాదంటావా?" అన్నది ముత్తయిదువు.

కమల జవాబుచెప్పలేక, ఆమె చేయ మన్నట్టే చేసి, గుడివెనుకకు వచ్చింది. అరుగు మీద ముసలి ముత్తయిదువు కనిపించలేదు. ధ్యానం ముగిసిందేమో ఎటో వెళ్ళడానికి లేచాడు సాధువు. ఆమె, సాధువును ముత్తయిదువు గురించి అడి గింది.

"ఎవరూ? పసిమి ఛాయతో, నుదుటున అణాకాసంత కుంకుమతో, ఎర్ర చీరతో వున్నావిడేనా?" అని అడిగాడు సాధువు ఆశ్చర్యంగా.

"అవును, అవిడే, పేరు దుర్గమ్మట!" అన్నది కమల.

"నువ్వెంత పుణ్యవంతురాలువు, తల్లీ! సాక్షాత్తూ ఆ దుర్గామాతనే దర్శించావు. ఇదివరలో కూడా ఒకరిద్దరికి ఇదేరూపంలో కనిపించింది. నేను రోజూ గంటలతరబడి ఇక్కడ ధ్యానం చేసుకుంటున్నా, నాకే నాడూ దర్శనభాగ్యం కలగలేదు. నిజంగా ఆ దేవీకృపకు పాత్రురాలివయిన నువ్వెంత అదృష్టవంతురాలివి!" అన్నాడు సాధువు గుడికేసి చేతులు జోడిస్తూ.

ఎక్కడలేని ఆనందంతో ఒళ్ళు పులక రించింది, కమలకు. ఆ ముసలి ముత్తయిదువు మాటలే ఆమె చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. గోడమీద పేర్లు చెక్కించుకోవడం ముఖ్యంకాదనీ, ముందుగా ఆపదల్లో వున్న వారిని ఆదుకోవడమే మానవధర్మం అనీ – ఆ దుర్గమ్మతల్లి పరోక్షంగా తనకు చెప్పింది! అంటే తనకు బంగారు హారం కాదు, ముందు కష్టాలలో వున్న పినమామగారి కుంటుంబానికి సాయపడమని స్వయంగా చెప్పింది!

ఇక, కమల ధర్మకర్త కోసం ఆగక, అప్పటికప్పుడు ఇంటకి తిరిగివెళ్ళి, డబ్బు సంచీ భర్తచేతికిచ్చి, "ఈ డబ్బు మీ బాబాయిగారి వైద్యానికీ, అమ్మాయి పెళ్ళికీ ఖర్చు చేయండి," అన్నది.

మాసం తిరక్కుండా, బాబాయికూతురు పెళ్ళి శుభలేఖ, తన మిత్రుడి తల్లిదండ్రుల చేతికిస్తూ, కమలభర్త వాళ్ళతో, "శుభవార్త తెలియజేయడానికి మాత్రమే ఇస్తున్నాను. మీరు పెళ్ళికి మాత్రం రావద్దు. ఎంత వేషాలుమార్చినా, మిమ్మల్ని చూస్తే దుర్గమ్మ, సాధువు మీరేనని, మా ఆవిడ ఇట్టే కనిపెట్టేస్తుంది. పేరుకోసం కాకుండా, అవసరంలో వున్న వారిని ఆదుకోవడానికి మంచి పనులు చేయాలనే ఆలోచన, ఇలాగే మా ఆవిడలో కొనసాగితే అందరికీ మంచిది!" అన్నాడు.

"అమ్మవారిపేరు చెప్పి పాపం చేశామేమో అని భయంగా వుంది, బాబూ!" అన్నారు ఆదంపతులు శుభలేఖను తిప్పి తిప్పిచూస్తూ.

"మీరొక పెళ్ళి చేయడానికీ, అనారోగ్యంతో వున్న మరొకరికి సాయం చేయడానికీ, ఈ నాటకం ఆడి ఎంతో పుణ్యం కట్టుకున్నారు. ఆ సంగతి మరవకండి!" అన్నాడు కమలభర్త నవ్వుతూ.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1997 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



MAHANTESH C. MORABAD



MAHANTESH C. MORABAD

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * అక్టోబర్ నెల 25వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:
చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, చెన్నయ్ - 600 026

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : గెంతే వయసుకు భయం చెప్పనా?

రెండవ ఫోటో : కదలని బొమ్మకు కథలు చెప్పనా?

పంపినవారు : పి. ఎస్. ఎన్. సురేష్ 17-22-46, హెచ్. ఎమ్. రోడ్,
ఇస్లాంపేట, తెనాలి - 522 201
గుంటూరు జిల్లా (ఆం.ప్ర)


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00
చందా పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, చెన్నయ్ - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Pvivate Ltd., Chandamama Building, Chennai- 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, 188, N.S.K.Salai, Vadapalani, Chennai- 600 026 (India) Editor : NAGI REDDI.

THE MOST ENDEARING GIFT YOU CAN THINK OF
FOR YOUR NEAR AND DEAR WHO IS FAR AWAY

# CHANDAMAMA



**Give him the magazine in the language of his choice—**
Assamese, Bengali, English, Gujarati, Hindi, Kannada, Malayalam, Marathi, Oriya, Sanskrit, Tamil or Telugu
**—and let him enjoy the warmth of home away from home.**

**Subscription Rates (Yearly)**

**AUSTRALIA, JAPAN, MALAYSIA & SRI LANKA**

By Sea mail Rs **129.00** By Air mail Rs. **276.00**

**FRANCE, SINGAPORE, U.K., U.S.A., WEST GERMANY & OTHER COUNTRIES**

By Sea mail Rs **135.00** By Air mail Rs. **276.00**

**Send your remittance by Demand Draft or Money Order favouring 'Chandamama Publications' to:**

CIRCULATION MANAGER **CHANDAMAMA PUBLICATIONS** CHANDAMAMA BUILDINGS
VADAPALANI MADRAS 600 026

Regd. No. M. 4854/97
RN 114 / 57